# సాహిత్య కౌముది

E401A122

భావ శరత్తు 18 AUTUMN 1994



సంపాదకులు
తంగిరాల సుబ్బారావు - ఆర్వీయస్. సుందరం



కృష్ణశాస్త్రి - శ్రీశ్రీ

# చైతన్య కవిత

**18**

భావనామ సంవత్సరం

శరదృతువు

**1994**

**AUTUMN**

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం


చైతన్య కవితా వేదిక

ఆర్-2, జ్ఞానభారతి

బెంగుళూరు 560 056.

CHAITANYA KAVITA, a journal devoted to Telugu poetry
Published by Chaitanya kavita vedika, R-2, Jnana Bharathi, Bangalore University Campus, Bangalore 560 056
October 1994 pp. x+66

ముఖచిత్రం : ప్రముఖ విప్లవ కవి శ్రీ కె.శివారెడ్డి
(6-1-711 Khairatabad, Hyderabad – 500 004)

అట్టవెనుక : 'అవధాన పంచానన', 'ఆశుకవి చక్రవర్తి'
శ్రీ బులుసు వేంకట రామమూర్తి
(F 12/8 A.P.P.M Quarters, Mallayyapeta,
Rajahmundry 533 105)

అక్షరాలంకరణ : ఆచార్య పి.సి. నరసింహారెడ్డి
(శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి)

| | | | |
|---|---|---|---|
| వెల | : విడి ప్రతి | రూ. | 20–00 |
| | ప్రత్యేక సభ్యత్వం | రూ. | 200–00 |
| | జీవిత సభ్యత్వం | రూ. | 500–00 |
| | పోషక సభ్యత్వం | రూ. | 1,000–00 |
| ప్రకటనలు | : నాల్గవ కవరు: | రూ. | 4,000–00 |
| | రెండవ కవరు: | రూ. | 3,000–00 |
| | మూడవ కవరు: | రూ. | 2,000–00 |
| | పూర్తి పుట : | రూ. | 1,000–00 |

For copies : Prof. T.V.SUBBARAO
Department of Studies in Telugu
Bangalore University, Jnana Bharathi
Bangalore - 560 056

Dr. R.V.S. SUNDARAM
Department of Telugu
I.K.S. University of Mysore, Manasa Gangotri
Mysore 570 006

ముద్రణ : Compagers DTP Services
360, 10th Cross, M.L. Layout, Bangalore -86.

# మనవి

కేవలం కవిత్వానికే అంకితమైన ఏకైక పత్రిక 'చైతన్యకవిత'. ఇటువంటిది ఆంధ్రదేశంలో కాని ఇతర రాష్ట్రాలలోకాని ఎక్కడా లేదు. ఇటువంటి విశిష్ట పత్రికను మిక్కిలి కష్టపడుతూ 1986 నుండి వెలువరిస్తున్నాం. ఆరు మాసాల కొకసారి వెలువడే ఈ పత్రికకు ఇప్పటి వరకూ 14 సంచికలు వెలుగులోకి తెచ్చాం. ఒక్కొక్క సంచికకు సుమారు ఐదువేల రూపాయలు ఖర్చు చేస్తున్నాం. అంటే ఇప్పటివరకూ 70 వేల రూపాయిలు వెచ్చించాం. కవిత్వాభిమానులు కట్టిన చందాలతో ఈ పత్రిక ఇంతవరకూ నడిచింది. రెండు మూడు సారులు పత్రిక నిలిచి పోయే పరిస్థితి వచ్చినప్పుడు మా చైతన్య కవితా వేదిక అధ్యక్షులు శ్రీ డి.కె. ఆదికేశవులుగారు గొప్ప ఔదార్యంతో దీనిని ఆదుకున్నారు. ఉపాధ్యక్షులు శ్రీ బుల్లా సుబ్బారావుగారు మాకు వెన్నెముకగా నిలిచారు. వీరిద్దరికీ మేం మాటలతో చెప్పలేనంతగా ఋణపడి వున్నాం.

చైతన్యకవిత నిరాఘాటంగా వెలువడాలంటే సభ్యత్వ సంఖ్యను పెంచుకోవడం, ప్రకటనలు (advertisements) వేయడం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని – ముఖ్యంగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని అర్థిచడం మాత్రమే మార్గాలుగా కనబడుతున్నాయి. ఈ ప్రయత్నాలు ఫలిస్తే ఇప్పుడు ముద్రిస్తున్న 500 కాపీలను 1,000 కాపీలకు పెంచవచ్చును కూడా.

కవులూ, కవిత్వాభిమానులూ, పారిశ్రామిక వేత్తలూ, తెలుగు విశ్వవిద్యాలయంవారూ మాకు చేయూత నిస్తారని విశ్వసిస్తున్నాం.

ముద్రణ వ్యయం ప్రతి సంవత్సరం పెరిగిపోతూ ఉండడంతో ప్రత్యేక సభ్యత్వం 100 రూపాయలనుండి 200 రూపాయలకు పెంచడం జరిగింది. ఇదివరలో 100 రూపాయలు కట్టిన వారంతా మరో 100 రూపాయలు పంపవలసిందిగా ప్రార్థిస్తున్నాం.

బెంగుళూరు
భావ – విజయదశమి

–సంపాదకులు
14–10–1994

## అంకితం

'తణుకు' వాస్తవ్యులూ
'తంగిరాల' బాల్య మిత్రులూ
సాహిత్య ప్రియులూ
అయిన
శ్రీ లకంసాని శ్రీరామకృష్ణగారికీ
శ్రీ చిట్టూరి సూర్యారావుగారికీ
ఈ పత్రిక
సస్నేహంగా.......

— సంపాదకులు

# తంగిరాల సుబ్బారావు

## ఇద్దరు మిత్రుల కోసం *

### 1

నల్లరేగడిని దున్నుతున్న
నాగటి కర్రులోంచి
వాళ్ళిద్దరూ;
తెల్లటి విభూతిలోంచి
వేదపఠనంలోంచి
నేను.
ముగ్గురం
బాల్య మిత్రులం
ప్రాణ మిత్రులం
స్నేహ త్రిమూర్తులం!

స్వాతంత్ర్యానంతరం
మా బాల్యం యౌవనం చదువుసంధ్యలు –
తణుకులో
త్రివేణిగా జడలల్లుకుపోయి,
కాలం మల్లెపూదండ తురుముకొని,
ఇప్పుడు
గుప్పున మా గుండెలనిండా
గుబాళిస్తున్నాయి.
అప్పటినుంచి ఇప్పటివరకూ
తణుకు పాతవూరు వంతెన క్రింద

*మాస్వగ్రామమైన తణుకులో హైస్కూలు నుండి కాలేజీవరకూ నాతో కలిసి చదివిన బాల్య మిత్రులు శ్రీ లకంసాని శ్రీరామకృష్ణ శ్రీ చిట్టూరి సూర్యారావుల కోసం ఈ కవిత. నేనూ రామకృష్ణా 'థర్డ్‌ఫారం' అనబడే 8వ తరగతినుండి బి.ఏ వరకూ ఒకే తరగతిలే ఒకే సెక్షన్‌లో కూర్చుని చదువుకున్నాం. 8 వ తరగతినుండి యస్.యస్.ఎల్.సి అనబడే 11వ తరగతివరకూ సూర్యం కూడా మా సెక్షన్‌లోనే ఉన్నాడు తణుకు బోర్డు హైస్కూలులో.

గోస్తనీనదిలో
ఎంత నీరు ప్రవహించిందో ఎవడికి తెలుసు?
ఒక సాత్విక సౌజన్యంతో
మరొక రౌడీ మంచితనంతో
నా అమాయకత్వ మేధ చేసిన విచిత్ర చెలిమిలో
దారిద్ర్యబాధ తెలియలేదు
కష్టపరంపర తెలియలేదు
కాలగమన వేగమే తెలియలేదు!
నా బాల్య యౌవనాలు
ఉత్సాహపు పూలదొంతరలమీద దొర్లిపోయాయి!!

## 2

చిన్నప్పుడు
తణుకులో
ముగ్గురం కలిసి చదివాం.
పెద్దప్పుడు
భీమవరంలో
నేనూ రామకృష్ణా
దిగుమర్తి [1] వారి శిష్యరికం చేశాం.
మద్రాసులో సూర్యం
తిరుపతిలో నేను
భిన్న కాలాలలో
తి.కో.రా[2] శిక్షణ పొందాం.
చివరకు
మళ్లీ తణుకులో
తిలక్[3] కవితామృతం కురిపించిన వెన్నెల రాత్రిలో
ముగ్గురం కలిసి తడిసి పోయాం !
మేం ముగ్గురం ఎప్పుడూ ప్రాణమిత్రులమే అయినా
ఒక్క దీపావళి నాటి రాత్రి మాత్రం పరమ శత్రువులం!
ఆరోజు

1. గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారు (1914–1972)
2. గురువర్యులు తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు (1926–1981)
3. ప్రముఖకవి దేవరకొండ బాలగంగాధర తిలక్‌గారు (1921–1966)

తణుకు పాతవూరు వంతెన మీద
కొత్తవూరికీ పాతవూరికీ తారాజువ్వల పోటీకదామరి!
నాది కొత్తవూరు వాళ్ళది పాతవూరు
ఇంక శత్రువులం కాక ఛస్తామా మరి!

## 3

నా జీవన మహాప్రస్థానంలో
పెళ్ళి చేసుకొని
పిల్లల్ని కని
ఉద్యోగాలు వెతుక్కుంటూ
ఊళ్ళకు అతుక్కుంటూ
పొట్ట చేత్తో పట్టుకొని
పడరాని పాట్లు పడి
దైవ కృపకు పాత్రుడనై
గురువుల ఆశీర్బలంతో
చదువు వెలుగు మెట్లన్నీ చక్కగా ఎక్కి
కీర్తి పుష్పకిరీటం పెట్టుకొని
తెలుగు దేశం వేదిక మీద
ఈ నాడు నవ్వుతూ నేను!
నన్నయ భట్టారక పీఠం
సాహిత్య సభలో
నా ఉపన్యాసం వింటూ
తలపంకిస్తూ
పులకిస్తూ
ఆ ఇద్దరు బాల్య మిత్రులు!

నాతో కలిసి
గురుదేవులు దిగుమర్తివారి శిష్యరికంలో
తెలుగు సాహిత్యాన్ని మథించి
మళ్ళీ మట్టిమనిషిగా మారిపోయిన
మా ఎల్లేస్. రామకృష్ణ!

మద్రాసులో

గురువర్యులు తి.కో.రా. దగ్గర తెలుగు పఠించి
సాహిత్యాభిరుచిని పెంచుకొని
చల్లగా తణుకు చేరి
ధనవంతుల ద్యూతవర్షంతో వచ్చిన
మొద్దుబద్ధకం వరదల్లో మునిగిపోయిన
'టౌనుహాలు' చీకటి కీకారణ్యంలో
పేకముక్కల సమాధిలో తపస్సు చేస్తూ
అప్పుడప్పుడు తలెత్తి నా రాక కోసం ఎదురు చూస్తూ
మా చిట్టూరి సూర్యం!

## 4

మేం ముగ్గురం
గృహస్థులమై తండ్రులమై తాతలమై
తామర తంపర సంసార పద్మకాసారంలో
తృప్తిగా జలక్రీడలాడి
ప్రొద్దు వాలిపోతుంటే
జీవన నాటకం పంచమాంకంలో ప్రవేశించి
రకరకాల మొండి రోగాల సర్పదష్టులమై
మందుల పాముల మంత్రాలు జపిస్తూ
అప్పుడప్పుడు కలుస్తూ
కష్టసుఖాలు కలబోస్తూ
ముది వగ్గులమవుతున్న మేం ముగ్గురం
దృశ్యాదృశ్య మరణ దేవత బలివితర్ది ముందు
నల్లమేకలం!

## 5

నా ప్రియ మిత్రులారా!
చిన్నతనంలో ఎన్నో నాటకాలాడిన మనం
ఎప్పుడో ఒకప్పుడు ఈ జీవన నాటకంలోంచి
తప్పుకోక తప్పదు.
అయినా మనకు జన్మరాహిత్యం వద్దు
బ్రతుకు తీపి మనకు ముద్దు
మళ్ళీ తణుకు చుట్టుప్రక్కల నల్లరేగడి మట్టిలో
చెఱకు కణుపుల్లా మొలుద్దాం

క్రొత్త ర్యాలీ సైకిళ్ళు త్రొక్కుతూ హైస్కూలుకు వద్దాం
గోస్తనీనది వడిలో పడి ఎదురీతలు కొడదాం
ఆటలూ— పాటలూ, చదువులూ— సంధ్యలూ,
యౌవనాలూ— ఉద్రేకాలూ, ప్రేమలూ – పెళ్ళిళ్ళూ,
సంసారాలూ— సాగరాలూ,
అగాధ భవ బంధాలూ—
మళ్ళీ మళ్ళీ మన కాళ్ళకు తగిలించుకుందాం
ఈ బ్రతుకు బంగారు తీగ చెఱుకుగడను
పళ్ళతో కొరికి రసం పీల్చుకుంటూ ఆనందిద్దాం!

## 6

అన్నట్టు—
నా అనుంగు సంగడీలూ ! మిమ్మల్ని
అడగడం మరిచి పోయానయ్యా ...
చక్కెర వ్యాధి ముదిరి
కళ్ళల్లో కటికి చీకట్లు క్రమ్ముకుంటున్న ఓ రామకృష్ణా!
నాయీ కవిత నీవు చదవగలవా మరి?
బ్రెయిన్ పెరాలిసిస్ లాంటిది వచ్చిన ఓ నా సూర్యమా!
అసలు నన్నూ నా కవితనూ నువ్వు గుర్తు పట్టగలవా మరి?
అయ్యో! నా ఆ బాల్య సఖులారా!
ఈ కవితనేను ఎప్పుడో వ్రాయవలసింది—
నా గుండె చప్పుడు మీకు ఎప్పుడో వినిపించవలసింది –
నేను 'లేట్‌లతీఫ్' గాడిని!
మీరిద్దరూ బ్రతికుండగానే
ఎలిజీ వ్రాసిన పాపాత్ముడిని!
నన్ను
క్షమించండి!!

14–4–1994

# శరత్తారలు

# శివ కవిత

## — కలువకొలను రాంమోహన్ రాజు

ఆధునిక తెలుగు సాహిత్యంలో 1970నుంచి 1990దాకా తీసుకుంటే ఒకవైపు విప్లవ సాహిత్యోద్యమం ఉన్నప్పటికీ విప్లవ సాహిత్య సంఘాలకి బయట ఉండి విప్లవ సాహిత్యాన్ని సృష్టించిన వాళ్ళనేకులున్నారు. వాళ్ళందరిలోనూ శివారెడ్డి రాశిరీత్యా, వాసి రీత్యా నాయక స్థానంలో ఉంటారు.

శివారెడ్డి సాహిత్య రచనకి పూనుకున్న కాలంలో విప్లవ సాహిత్యోద్యమం బలంగా వుంది. ఐనప్పటికీ ఆయన దానిలో చేరకుండా స్వతంత్ర పంథాలో పయనించాడు. రూపరీత్యా విప్లవ సాహిత్యమే ఐనా శివారెడ్డి కవితలో అభివ్యక్తి వేరు. దాన్ని ఆయన స్వంతంగా రూపొందించుకున్నాడు.

'అమ్మ మాటల్నించి, అయ్య పాటల్నించి స్వీయకంఠారావం మేళవించుకున్న కూని రాగాల్నించి చవిటి పర్రలూ, ఇసికతిన్నెలూ, సర్విచెట్ల నొయ్యారాల నృత్యాల్నించి ఒకడు అలాగ నడిచినొచ్చి మనిషవుతాడని ఎవడన్నా అనుకోటానికి వీలువున్న సమాజం కాదు మనది'. అందువల్ల శివారెడ్డి కూడా కవి నాయక జనాభాలో ఒకడే కాగలడని మొదట్లో చాలా మంది అనుకున్నారు.

కానీ కాస్త చరిత్రని పరిశీలించి చూస్తే సంధికాలంలోంచి ఎదిగివచ్చిన వాళ్ళే తర్వాత మంచి కవులుగా నిలబడ్డారనేది తెలుస్తుంది. శివారెడ్డి దీనికి అపవాదం కాదు. తెలుగు సాహిత్యంమీద తానొక బలమైన ముద్రవెయ్యగలనని 'రక్తం సూర్యుడు' తోనే నిరూపించిన శివారెడ్డి 'ఆసుప్రతి గీతం'తో తాను విజేతనని ప్రకటించాడు. శివారెడ్డికున్న అనేక ప్రత్యేకతల్లో ఆయన స్వంత డిక్షన్ ఒకటి. అటు దిగంబర కవితనీ, ఇటు విప్లవ కవితనీ సన్నిహితంగా గమనించినవాడు గనుక కవితలో తనదైన ముద్రకోసం డిక్షన్ రూపొందించుకున్నాడు. చాలామంది భావిస్తున్నట్టు ఆయన శైలి ప్రత్యేకమైన దేమీకాదు. బాలగంగాధర తిలక్‌కు కూడా అదేరకం శైలి వుంది. శివారెడ్డి చేసిన పనల్లా అలాంటి శైలికి తన పదజాలంతో వేగాన్నివ్వటమే.

ఒక్క నగ్నమునిని పక్కన బెడితే, శివారెడ్డి మాత్రమే సమకాలికుల్లో బలమైన ధ్వని ప్రకటించగలవాడు. కవితలో కథా శిల్పం జొప్పించటం కూడా శివారెడ్డికున్న లక్షణాల్లో ఒకటి. దీన్ని ఆసుప్రతి గీతంలో పూర్తి స్థాయిలో చూడవచ్చు.

ఎమర్జెన్సీలో ఆసుప్రతి గీతాన్ని వెలువరించి అందర్నీ ఆశ్చర్యపరిచాడు శివారెడ్డి. కవుల రచయితల గళాలన్నీ అణిచేసిన ఎమర్జెన్సీలోనే రెండు పుస్తకాలు తీసుకురావటం శివారెడ్డి బలమైన కవితా వ్యక్తిత్వానికి నిదర్శనం.

సమాజంపై వర్గ పాలకుల ఉక్కు పిడికిలి బిగిసినపుడు నిర్బంధంలో సైతం ప్రతీకల ద్వారా, అద్భుతమైన సాహిత్యాన్ని ఎలా సృష్టించవచ్చో శివారెడ్డి చేసి చూపాడు. అప్పటినించీ శివారెడ్డిని తప్పనిసరిగా పట్టించుకోవలసిన అవసరం అందరికీ ఏర్పడింది.

శివారెడ్డి కవిత్వంలో లోపాలు లేవని కాదు. కానీ అవి ఏ కవికైనా తప్పనివే. ఒకే పదాన్ని పునశ్చరణ చేస్తూ రకరకాల భావాల్ని చిత్రించటం కవిత్వంలో చిక్కదనాన్ని పోగొడుతుంది. పైగా అది ఒక చాపల్యంగా కన్పిస్తుంది కూడా. భారమితి నాటికి ఆయనలో కొన్ని ఇమేజరీలు విచిత్రంగా కన్పిస్తాయి. అవేవో ఇతర భాషల్నించి దిగుమతి చేసినట్టుతోస్తుంది.

దానికి కారణం మరేమీ లేదు. శివారెడ్డి ఆ కాలంలో ఇతర భాషల కవిత్వాన్ని సమృద్ధిగా తెలుగులోకి అనువదిస్తున్నాడు గనుక అలా అపోహపడే అవకాశం వుంది. అది అపోహ కాకుండా నిజమే ఐనా ఒక స్వదేశీ కవితో ప్రభావితమై కవిత్వం రాస్తే తప్పు కానప్పుడు విదేశీ కవితో ప్రభావితమై రాస్తే తప్పెలా అవుతుంది ? ఒక పుస్తకం చదివినప్పుడో, ఒక సినిమా చూసినప్పుడో ఒక్కోసారి కొత్త ఊహలు స్ఫురిస్తాయి. శివారెడ్డి కవిత్వంలో లోపాలు ఉన్నాయని చెబుతున్నారంటే ఆయన కవిత్వాన్ని పట్టించుకుంటున్నారనే అర్థం. శివారెడ్డిలో కనిపించే లోపాలు నిజానికి చాలావరకు ప్రయత్న పూర్వకమైనవే. అందుకు తావిచ్చిన శివారెడ్డిదే ఆ బాధ్యత.

శివారెడ్డి సాహిత్య జీవితంలో 'రిసరెక్షన్' అవసరం ఎన్నడూ రాలేదు. నిరంతర ప్రవర్ధమాన సదృశమైన అతని కవిత్వం ఎప్పుడూ 'ఫ్లోటింగ్' దశలోనే వుంది. ఇప్పుడు ప్రచురించిన 'శివారెడ్డి కవిత' తెలుగులో ఆధునిక కవులకు సంబంధించినంతవరకు ఒక అపూర్వ సత్యాన్ని ప్రకటిస్తోంది. ఏ కవి కూడా తన యాభై ఏళ్ళలోపే, సాహిత్య జీవితం ప్రారంభించిన ఇరవయ్యేళ్ళకే 'సెలక్టెడ్ పోయమ్స్' పుస్తకంగా వెయ్యటం ఇంతవరకూ జరుగలేదు. శ్రీ శ్రీ అంతటివాడే షష్టిపూర్తికి గాని సమగ్ర సంపుటాలు తెచ్చుకోలేకపోయాడు. కుందుర్తి, కృష్ణశాస్త్రిగారలు కూడా అంతే. సి.నారాయణరెడ్డిది సెలక్టెడ్ వర్క్సేరాలేదు. 'యశసే అర్థకృతే'

అన్వేషి కాకుండా 'శివేతరక్షతి' కోసం కవితను సంధించాడు గనక శివారెడ్డి జంకు గొంకులు లేకుండా ఈ సమగ్ర సంపుటం వెయ్యగలిగాడు.

ముందుమాటలో తానేమిటో చెప్పకున్నప్పటికీ అతను చెప్పకోని రహస్యాలు ఇంకా ఎన్నో ఈ సంపుటంలోని కవితల్లో కనిపిస్తాయి. 'రక్తం సూర్యుడు' శివారెడ్డి మొదటి సంకలనం అనుకున్నా అది కూడా అప్పటికి పరిణతి చెందిన స్థాయిలోనే ఉంది. డెబ్భయిల్లో వ్యవస్థ మీద కసితో ఆగ్రహిస్తున్న యువకుడు ఈ సంకలనంనిండా పరుచుకుని ఉన్నాడు. 'వాడి చుట్టూ హోచిమిన్, గువేరా, కాస్ట్రో, మావో వారసులు. వాడు మరి స్వయంగా పదహారు హింసా వర్షాల కుర్రాడు! నేను కర్షకుణ్ణి, కార్మికుణ్ణి, విశ్వశ్రామికుణ్ణి !' అని అంతర్జాతీయతని ఆలపిస్తున్నాడు. విద్యుదాగారంతో కూడిన తన సిరా చుక్కతో శివారెడ్డి రక్తం సూర్యుడ్ని సృష్టించుకుని రాబోయే తన సంకలనానికి ఇక్కడే బీజం వేశాడు 'రక్తం ప్రతి చర్య' అంటూ.

1975 దందహ్యమాన దశాబ్దానికి పతాక స్థాయి. వందలాది మంది గెరిల్లా వీరులు ఎన్‌కౌంటర్లపాలయ్యారు. డజన్లకొద్దీ విప్లవ కవులు జైళ్ళపాలయ్యారు. దేశం యావత్తూ సంక్షోభంలో వుంది. నోరెత్తితే ఏడు ఊచలు కళ్ళముందు నిలిచే కాలం అది. అక్కడ శివారెడ్డి 'చర్య'కు పూనుకున్నాడు. ఆచరణకు తలపడ్డాడు. కవి ఆచరణ అంటే తన కవిత్వాన్ని మరింత బలంగా కొనసాగించటమే. 'ఆచరణలో జీవిస్తున్న నాకు మరణం లేదు' అని రామానుజాచార్యుడు కాంచీగోపురం ఎక్కి ప్రకటించినట్టుగా కవితాశైలీశృంగం నుంచి ఎలుగెత్తాడు. ఈ సంకలనంలో ఉద్విగ్న హృదయుడైన కౌమార ప్రాయుడు కాక, 'దిక్కులన్నీ విరుచుకుపడటంతో మారథం కదులుతుంది' అని నిబ్బరంగా పలుకుతున్నా ఆలోచనా శీలివున్నాడు. శివారెడ్డి కవిత రక్తంసూర్యుడులో దూకిన జలపాతం ఐతే ఇక్కడ నడక నేర్చిన నదిలా కన్పిస్తుంది.

తెలంగాణాలో మట్టి మనుషులు ప్రారంభించిన రైతాంగ పోరాటాల్ని అమ్ములుగా, నేత్రాన్ని ధనుస్సుగా సంధించి 'నాకు మట్టి కవిత్వం' అంటున్నాడు. 'ఎవడి వీర్యంతో ఈ భూమి పునీతమవుతుందో వాడిదే ఈ భూమి' అంటున్నాడు. తనలోని ఆగ్రహాన్ని శక్తివంతంగా గురితెలిసిన యోధుడిలా ప్రయోగించటం 'నేత్ర ధనుస్సు'లో చూస్తాం. స్పష్టత నిండిన పదాలు, బలమైన వాటి రూపం నేత్ర ధనుస్సుకు అల్లెత్రాడు అయ్యాయి. 'నన్ను నేను హరించుకుని జనం ప్రయోజనం వద్ద సమర్పించుకున్న

వాణ్ని' అనే వినమ్రతే కాకుండా, ఆ జనం 'లెమ్మంటే సముద్రమూ లేస్తుంది, ఆకాశమూ విరిగిపడుతుంది' అన్న విశ్వాసాన్ని కూడా నేత్ర ధనుష్టంకారంలో వినగలం.

శివారెడ్డిలో సున్నిత భావుకుడూ ఉన్నాడు. కవులందరిలోనూ అలాంటి సున్నిత భావుకత్వం ఉంటుంది కదా అంటే ఉండటం వేరు; అది అభివ్యక్తి రూపంలో బయటికి రావటం వేరు. కవి ఏ భావన చేస్తున్నాడో బయటికిరావాలి. లేకపోతే ప్రయోజనం లేదు. నిరక్షరాస్యులు కూడా సున్నితమైన భావాల్నే కలిగివుంటారు. కానీ వారికి దాన్ని ప్రకటించే భాష వుండదు. కవికి తగినంత భాష ఉంటుంది. సామాన్యుడికీ కవికీ ఉండే తేడా ఇంతే. శివారెడ్డికి ఆ భాష ఉండటమే కాక ప్రబలంగా ప్రపండంగా ఉంది. తనదైన పదజాలంతో మనతో మాట్లాడుతాడు. 'సౌండ్ ఎఫెక్టు' అంటామే అది ఆయన దగ్గర ఉంది. 'భారమితి'లో దీన్ని చూపాడు.

'రోదసందా అగ్నితో ఎరుపెక్కి' అంటాడు. వేరే వాడయితే 'రోదసి అంతా' అనిరాసేవాడు. 'ఎర ఎర్రని నృత్యం' అంటాడు ('ఎర్రెర్రని నృత్యం'). 'ఎర్ర కనుల వనమై' (ఎర్ర కళ్ళవనమై). అంతే కాదు గ్రాంథిక పదాల్ని కూడా తన లయకనుగుణంగా మలుస్తాడు. 'శరీర శబ్దాస్త్ర సంగీతం, శబ్దాల జఠరాగ్ని, దయాకంఠ సాగరం, రక్త వసంత గాన కృపాధారులు' ఇలాగ ఎన్నెన్నో.

అయితే ఇలాగ రాయగానే శివారెడ్డి గొప్ప కవి అయిపోయాడా? ఎంత మాత్రమూ కాదు. ఆ పదాలచుట్టూ ఒక వాతావరణం ఉంటుంది. దాన్ని సృష్టించి మధ్యలో ఇలాంటి పదాల్ని విసురుతాడు శివారెడ్డి. అప్పుడు ఓహో ! అని కనుబొమ్మలు పైకి లేపుతాం. మరో సారి వెనక్కి చదివినపుడు కవి నైపుణ్యానికి అబ్బురపోతాం. తర్వాత గీతం మొత్తాన్ని చూసినప్పుడు కవి చెప్పదలుచుకున్న భావం అంతా ఆ పదాల్లో కేంద్రీకరించబడిందని గ్రహిస్తాం. అప్పుడు ఆ కవిత దానంతటదే మనుసుల్లోకి ప్రవేశిస్తుంది. ఇకపోదు.

తాను అందిపుచ్చుకుని కొనసాగిస్తున్న విప్లవ కవిత్వ సంప్రదాయాన్ని మరింత బలంగా చెప్పటమే కాక కవిగా పరిపుష్టం కావటం 'భారమితి'లో కనిపిస్తుంది.

'బహుళ పంచమిజ్యోత్స్న భయపెట్టు నన్ను' అన్నాడు శ్రీశ్రీ. జీవితం భయ పెట్టనిదెవర్ని ? కానీ కొందరు లొంగిపోతారు. ఓడిపోతారు.

కొందరు దాన్ని ఎదుర్కొంటారు. దాని జూలుపట్టి లొంగదీసుకుంటారు. జీవితం ఉన్నంతకాలం జీవభయం ఉంటుంది. ఒక దశలో ఎక్కువుంటుంది; మరో దశలో తక్కువుంటుంది. మనిషి ఎక్కువ భయపడ్డప్పుడు అది వాణ్ని లొంగదీసుకుంటుంది. జీవితాన్ని లొంగదీసుకున్న వాడైనా సరే అది మళ్ళీ తనమీదికెప్పుడు దాడి చేస్తుందోనని భయంతోనే మథనపడుతుంటాడు.

అలా మథన పడుతున్నప్పుడు మనిషి కొన్ని పొరపాట్లు చేస్తాడు. దాంతో ఏకాకి అవుతాడు. చుట్టూ ఎంతో మంది కన్పిస్తున్నా తాను ఒంటరిననే భావంతో ఉక్కిరి బిక్కిరవుతాడు. ఏమిటి దీనికి కారణం అని ఆలోచిస్తాడు. ఇతర్లనీ తననీ పోల్చి చూసుకుంటాడు. ఆర్థిక సంబంధాలే ప్రధానమై నిన్నటిదాకా తనతో ఉన్నవాళ్ళే నేడు తనని వదిలి పక్కకి పోయారని గ్రహిస్తాడు. అప్పుడనంతమైన వేదన, ఆగ్రహం మనిషిని ముంచివేస్తాయి.

మాటకి అంతరార్థం వెతకటం ప్రారంభిస్తాడు. మాట నటుడైందని తెలుసుకుంటాడు. మాట రంకు నేర్చిందని గ్రహిస్తాడు. మాటకీ మాటకీ మధ్య కమ్యూనికేషన్ గ్యాప్ ఉందని ఇప్పుడతనికి అర్థమవుతుంది. ఐతే ఇదంతా ఎందుకు అని ప్రశ్నించుకుంటాడు. బతకటాన్ని బడా వ్యాపారం చేసిన ఈ మందరమయు వ్యవస్థే దీనికి కారణమని జవాబు వస్తుంది. అందువల్ల మాటని నిఖార్సుగా పుట్టించాలనుకుంటాడు. మాటని దుఃఖం లోంచీ, కోపంలోంచీ శుచిగా పుట్టించాలనుకుంటాడు.

మనిషిలో ఉండే పురాతత్వం వ్యథ. దాన్ని శివారెడ్డి 'మోహనా ఓ మోహనా' లో ఆవిష్కరించాడు. మనిషి వ్యథ చెందకపోతే జిజ్ఞాస కలగదు. అది కలగకపోతే చైతన్యం రాదు. చైతన్యం రాకపోతే అభివృద్ధి ఉండదు. ఇవి ఒక దాని వెంట ఒకటి సంభవించే పరిణామాలు. దున్నపోతు చర్మం గాళ్ళకి ఏదీ అంటదు గానీ సమాజం దానిపోకడా, దానిపట్ల బాధ్యతా వున్నవాళ్ళకి అన్నీ అవసరమే. అందుకే అన్నిట్నీ పట్టించుకుంటారు. ఆలోచిస్తారు. ఆందోళన చెందుతారు. 'నీకెందుకు వయా గవన్నీ, సక్కగ నౌకరి జేస్కోక' అనే వాళ్ళు లేకపోలేదు. వాళ్ళు అదృష్టవంతులు.

'మోహనా ఓ మోహనా' లో జీవచింత మాత్రమే కాకుండా 1985నుంచి తెలుగుదేశం మీద మళ్ళీ పరుచుకున్న రాకాసి గద్ద రెక్కల నీడల్లో కూడా శివారెడ్డి కవిత్వాన్నే కత్తిగా పట్టుకున్న వైనం కన్పిస్తుంది. ఈ సంప్రదాయాన్ని మొదటి నుంచీ ఆయన స్వచ్ఛందంగా పాటిస్తూ వస్తున్నాడు.

విప్లవ సాహిత్యోద్యమం సన్నబడ్డ పాయలా పారినప్పుడు కూడా శివారెడ్డి నిండు నదిలానే పారాడు. కవిత్వానికి కాలంకాదని వచ్చిన వాదానికి అందరి కన్నముందు శివారెడ్డే జవాబు చెప్పాల్సి వచ్చింది. ఎందుకంటే ఎక్కడా ఆగకుండా రాస్తున్నాడు గనక, రాయటంకోసం జీవిస్తున్నాడు గనక, రాయటమే జీవితమైంది గనక కవిత్వానికిది కాలం కాదన్న వాళ్ళని ఎదుర్కోవాల్సి వచ్చింది. అంతేకాదు, అప్పట్నించి రాయటం కూడా ఉద్ధృతం చేశాడు. తెలుగుకవిత్వమే కాక ఇతర భాషల కవిత్వాన్నీ అనుసృజించటం ప్రారంభించాడు.

సరిగ్గా ఈ బిందువు దగ్గర్నించి శివారెడ్డి తెలుగు కవిత్వాన్ని బలంగా ప్రభావితం చేశాడు. 1980ల తరవాత కలం పట్టిన కవుల్లో చాలా మంది శివారెడ్డి వ్యక్తిత్వ కవిత్వాలతో ప్రభావితులే. అనటం అతిగా వుంటుంది గానీ ఒక దశలో తెలుగు కవిత్వంలో 'శివారెడ్డి స్కూల్ ఆఫ్ పొయిట్రీ' ఏర్పడిందా అన్నంత ప్రభావాన్ని ఆయన కలిగించాడు.

శివారెడ్డి శైలినీ, భాషనీ అనుకరించిన వాళ్ళు చాలా మంది ఉన్నారు. అంతే కాదు, శివారెడ్డి ఇతర భాషల సాహిత్యాన్ని తెలుగు లోకి తేవటం చూసి తామూ ఆ పనికి పూనుకున్న వాళ్ళున్నారు. ఐతే శివారెడ్డిలో ఉన్న పట్టుదల, తపన, సాహిత్యం మీద అతని ప్రేమ, అంతరాగ్ని అతణ్ని ఈనాడు ఈ స్థాయికి తెచ్చాయి. శివారెడ్డి ప్రయత్నాలకి కాలం కూడా సహకరించింది. విప్లవ సాహిత్యోద్యమంలో బలమైన రెండో తరం కవులెవ్వరూ లేకపోవటం శివారెడ్డికి అనుకూలించిన అంశం.

విమర్శల విషయానికి వస్తే శివారెడ్డి మీద వచ్చినన్ని విమర్శలు మరే ఆధునిక కవి మీదా రాలేదనుకోవాలి. ఎందుకంటే శివారెడ్డి అన్ని సమకాలీన అంశాల్నీ స్పృశించాడు. హైదరాబాద్ నగరం మీద రాసిన గీతం ఎందరి మనసుల్లోనో మెదిలే భావాలకి బలమైన చిత్రణ.

బ్రతుకు భయంకరత్వాన్ని ఎన్ని కవితల్లో చెప్పినా 'మోహనా ఓ మోహనా!' లో చెప్పినంత బాగా ఏకవిత్వంలోనూ చెప్పలేదు. బ్రతుకు బాధని చెప్పటంలో శివారెడ్డి దైన్యాన్ని, బేల తనాన్ని చెప్పినట్టు కాకుండా తనని హింసిస్తున్న వ్యవస్థ వికృత రూపాన్ని వేళాకోళం చేస్తున్నట్టుగా వుంటుంది.

అతను ఏం చెప్పినప్పటికీ దాని వెనక పాతికేళ్ళ తపన వుంది. ఇది అందరికీ ఉండేదే ఐనా శివారెడ్డిలో ఉన్న తపనకి ధారవుంది. దానికి ఎక్కడా గండ్లు లేవు. 'రక్తం సూర్యుడు' దగ్గర మొదలైన శివారెడ్డి కవితాయాత్ర క్రమపరిణామం పొందుతూ ఇప్పుడు పక్వదశకు చేరింది.

విప్లవ సాహిత్యోద్యమం శివారెడ్డిని సొంతం చేసుకోవటం శివారెడ్డికే గర్వకారణం. శివారెడ్డి ఈనాడు తెలుగు కవిత్వానికి పర్యాయపదం అయాడు. తెలుగు సాహిత్యంలో వచ్చిన ఆధునిక ధోరణులన్నిటికీ సాక్షీభూతుడే కాకుండా వాటిలో పాల్గొన్నవాడు కూడా కావటం ఆయన కవిత్వాన్ని తీర్చిదిద్దింది.

తాను కమ్యూనిష్టుననీ, విప్లవాభిమానిననీ చెప్పుకోకుండానే, ఏ రాజకీయ పదజాలం వాడకుండానే, శివారెడ్డి ప్రముఖ విప్లవకవుల సరసన నిలువగలిగాడు. విప్లవ సాహిత్యంగూర్చి చెప్పుకోవాల్సి వచ్చినప్పుడు శివారెడ్డి కవిత్వాన్ని ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన పరిస్థితి ఈనాడు తెలుగు కవితా రంగంలో ఉంది.

విరసంతో పుట్టి విరసంతో పెరిగిన వాణ్నని శివారెడ్డి చెప్పుకోవటం మొహమాటానికి కాదు; నిజంగానే చెబుతున్నాడు. అయితే విరసం సాహిత్యం కన్న వైవిధ్యంతో శివారెడ్డి కవితారచన సాగింది; బహుముఖాలుగా సాగింది. ఆ సాగటంలో తనదైన విశిష్టతనీ, స్థానాన్నీ నిలుపుకుంది.

* * *

రోజూ కాస్త నన్ను నేను చంపుకుంటాను
నా స్తన్యం త్రాగిన అక్షరాలు నా కళ్ళముందు ఎదుగుతూ వుంటాయి
వాటి బహుముఖాల్లో బహురూపాల్లో నా ఆత్మసారం జీవిస్తుంది.

– కె.శివారెడ్డి (మోహనా! ఓ మోహనా! )

There are only three things in the world.
One is to read Poetry; another is to write Poetry;
and the best of all is to love Poetry.

-- Rupert Brooke

మరణం 2004 ఆగస్టు 18వ తేదీ

‘అవధాన పంచానన’ ‘ఆశుకవి చక్రవర్తి’

# బులుసు వేంకట రామమూర్తి గారు

(1929-2004)

తంగిరాల వెంకట సుబ్బారావు

“బులుసు కులాబ్ధిసోమ! రసపూర్ణ వచోనిచయైక సీమ! ని
ష్కలుష గుణాభిరామ! కవికల్పమహీరుహ గోగినేని పూ
ర్వీలసితధామ! ఆశు లహరీ విహరీకృత యావదాంధ్ర భూ
వలయ లలామ! మిత్రజన వాంఛిత వేంకటరామ! క్షేమమా! ”

—శేషేంద్ర

**జననం:**

శ్రీ బులుసు వేంకటరామమూర్తిగారు అష్టావధానాలు చేయడంలోనూ, ఆశుకవిత్వాలు అల్లడంలోనూ ఎంత దిట్టలో ‘యుగకవి’ శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారి పైపద్యం వల్ల విశదమవుతోంది. వీరు క్రీ.శ. 1929వ సంవత్సరం మే నెల 12 వతేదీని శ్రీకాకుళం జిల్లా (ప్రస్తుతం విజయనగరం జిల్లా) లోని బొబ్బిలిలో జన్మించారు. వీరు లక్ష్మీనరసమ్మ, నరసింహశాస్త్రి దంపతుల తొలినోముల పంట.

రామమూర్తిగారి పూర్వీకులు తూర్పుగోదావరి జిల్లాలోని ‘ఐనవిల్లి’ అగ్రహారానికి చెందినవారు. వీరి తాతగారి తాతగారో లేక తండ్రిగారో బొబ్బిలి రాజావారి ఆస్థానంలో పండితుడుగా చేరారు. ఆయన పేరు బులుసు వేంకటాద్రి సోమయాజులుగారు.

**పెదనాన్నగారు :**

రామమూర్తిగారి పెదనాన్నగారు బులుసు సీతారామశాస్త్రిగారు గొప్ప పండిత కవి; అష్టావధాని; ముఖ్యంగా ఆశుకవిత్వంలో అసమాన ప్రజ్ఞాపాటవాలు కలవారు. వీరు ఒకసారి జయపూర్ మహారాజా విక్రమదేవ వర్మగారిని దర్శించారు. అప్పుడు రాజావారు తన ప్రక్కనే ఉన్న కుక్కను చూపించి “దీనిమీద కవిత్వం చెప్పండి” అని అడిగారు. వెంటనే సీతారామశాస్త్రిగారు ‘రాజు+ కుక్క’ రెండర్థాలు వచ్చేలా ఆశువుగా ఒక శతకం (‘శునక శతకం’) చెప్పారట. దానిలోని రెండు పద్యాలు

మాత్రం రామమూర్తిగారి ధారణలో ఈ నాటికీ ఉన్నాయి.

"అనకన్ మానవు కాఱుకూతలను, నీవార్జింతువా చెప్పులన్
వినకన్ మానవు చిత్తకుక్కల రొదల్, వీక్షింతువా యెమ్ములన్
మనకన్ మానవు ఛీయటన్నను ధరన్ మన్నింప నెవ్వారి నో
శుకకంబా ! కనకంపు గద్దెపై కూర్చుండ సంతోసమే? "

"చనువొప్పారగ తోకనూపుచును, వాచాటత్వమున్ బూని ము
ద్దని కూయున్ దలకొందు వార్యజన హేయా! పూతిగంధాలయా!
పని లేదింతయు తీరుబాటు నహి నీప్రావీణ్యమిద్దే కదా
శునకంబా ! కనకంపు గద్దెపై కూర్చుండ సంతోసమే ? "

సీతారామశాస్త్రిగారు కొంతకాలం మద్రాసులో వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారి ప్రెస్సులో ఉద్యోగం చేశారు. వీరు రచించిన 'కృష్ణ కుమారి' అనే నాటకాన్ని వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు ప్రచురించారు. వీరు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు గారిమీద ఒక సీసపద్యం ఆశువుగా చెప్పారు. కాని అందులో రెండు పాదాలు మాత్రమే రామమూర్తిగారి ధారణలో ఉన్నాయి:

"భాషా సతికి బెంపు బర గించె నెవ్వాడు
ధనముచే గ్రంథ శోధనముచేత
ప్రాచీన గ్రంథాల బ్రచురించె నెవ్వాడు
ధనముచే నిత్య శోధనము చేత"

అష్టావధానం నిర్వహించడంలోనూ ఆశుకవిత్వం చెప్పడంలోనూ బులుసు వేంకటరామమూర్తిగారికి అచ్చంగా వారి పెదనాన్నగారి పోలిక వచ్చింది.

నాన్నగారు:

రామమూర్తిగారి తండ్రిగారైన బులుసు నరసింహశాస్త్రిగారు ఉభయ భాషా ప్రవీణులు, ఉత్తమ కవి పండితులు. వ్యాకరణంలో అందె వేసిన చేయి. 'త్రిలింగ లక్షణ సారము' అనే గ్రంథాన్ని రచించారు. వీరు క్రీ.శ. 1929–30 మధ్యకాలంలో మద్రాసులోని పచ్చయ్యప్ప కళాశాలలో ట్యూటరుగా పని చేశారు. తరువాత 1930 నుండి 1936వరకూ పరశువాకంలోని సర్.ఎం.సి.టి. ముత్తయ్య చెట్టియార్ హైస్కూలులో ఉద్యోగం చేశారు. 1936నుండి 1943 వరకూ 'తాళ్ళబురిడి' లోని

ఆంధ్రగీర్వాణ ఉచిత విద్యాపాఠశాలలోనూ ; 1943–44 లో 'సాలూరు' లోని కొట్టక్కి సోమన్న హైస్కూలులోనూ; 1944–46లో 'శంబర' లోని రాజగోపాలం ప్రాథమికోన్నత పాఠశాలలోనూ తెలుగు పండితుడుగా పనిచేసి కీర్తి గడించారు. 1946లో స్వర్గస్థులయ్యారు. వీరు జయపూర్ మహారాజా విక్రమదేవ వర్మగారి మీద చెప్పిన సీస పద్యం చాలా గొప్ప పద్యం.

"ఏ నరేశ్వరుని అనూనాంత రంగంబు
రంగంబు శారదా రమణి కెపుడు
ఏ జనవంద్యు విభ్రాజితాస్థానంబు
స్థానంబు సత్కవీశ్వరుల కెల్ల
ఏ కృపాకరుని ధర్మైకానుసరణంబు
శరణంబు విద్యావిశారదులకు
ఏ పవిత్రచరిత్రు నింపౌ ప్రసాదంబు
సాదంబు గతిలేని సాధువులకు

ధీరుడాతడు జయపురాధీశ్వరుండు
పావన యశుండు విక్రమ దేవ వర్మ
పిల్లలును దాను వర్ధిల్లు చల్లగాను
ధరణి లోపల నాచంద్రతారకముగ !"

రామమూర్తిగారు తమ తండ్రిగారి ఈ సీస పద్యాన్ని అనుకరిస్తూ తమ పోషకులైన గోగినేని వేంకటేశ్వరరావుగారి మీద మరొక చక్కని సీస పద్యాన్ని అల్లారు.

### విద్యాభ్యాసం – ఆటంకం :

తండ్రిగారు ఉద్యోగ రీత్యా మద్రాసులోను శ్రీకాకుళం జిల్లాలోనూ పనిచేయడంవల్ల రామమూర్తిగారి ప్రాథమిక విద్యాభ్యాసం కూడా ఈ రెండు ప్రదేశాల్లోనూ జరిగింది. ఒకటి రెండు తరగతులు స్వగ్రామమైన బొబ్బిలిలోనూ, మూడు నాలుగు తరగతులు మద్రాసులోనూ, ఐదవ తరగతి పార్వతీపురంలోనూ, ఆరు ఏడు తరగతులు సాలూరులోనూ రామమూర్తిగారు చదివారు. వీరు ఏడవ తరగతి పరీక్షలో ఉత్తీర్ణులు కాగానే తండ్రిగారు మరణించారు. అంతటితో వీరి చదువు ఆగిపోయింది. సంసార బాధ్యత మీద పడింది. 1946–48 మధ్యకాలంలో మాత్రం వీరి మాతామహుడైన గన్నవరపు చిన్ని కృష్ణమ్మగారు వీరి సంసారాన్ని

ఆదుకున్నారు. 1949లో రామమూర్తిగారు తన తల్లిని తమ్ముణ్ణి తీసికొని విజయనగరం చేరారు.

**విజయనగరంలో కవిత్వ శిక్షణ:**

కళింగాంధ్ర సంస్కృతికి, సర్వ లలిత కళలకు ఆటపట్టు విజయనగరం. కవి పండితులకు ఆలవాలం విజయనగరం. బులుసు వేంకటరామమూర్తిగారి కవితాజీవితానికి బీజాలు ఈ విజయనగరంలోనే పడ్డాయి. మొదట రామమూర్తిగారు మహా రాజా సంస్కృత కళాశాలలో పండితుడుగా ఉన్న పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారి దగ్గర సంస్కృతాంధ్ర కవితా విద్యాభ్యాసం ప్రారంభించారు. ఆయన రామమూర్తిగారి చేత కొన్ని వందల తెలుగు పద్యాలు కంఠస్థం చేయించారు. 'కవితా కోవిద' చింతల పూడి సన్యాసిరావుగారి దగ్గర పద్య రచనలో మెలకువలు నేర్చుకున్నారు. 1949-53 మధ్యకాలంలో ఆశుకవిత్వం అల్లడంలోనూ, అష్టావధానం చేయడంలోనూ 'పండిత', 'కవిరత్న', 'శతావధాని' మాడుగుల వేంకట సూర్యప్రసాదరావుగారి దగ్గర శిక్షణ పొందారు. ఈ విధంగా రామమూర్తిగారి సాహిత్యవ్యక్తిత్వం తీర్చిదిద్దబడింది.

**అష్టావధాన ప్రారంభం :**

బులుసు వేంకటరామమూర్తిగారు 1951లో శ్రీకాకుళం జిల్లా హిరమండలం హైస్కూలులో తమ మొట్టమొదటి అవధానం చేశారు. ఆ స్కూలు హెడ్మాస్టరుగారైన ఉప్పాడ రామమూర్తిగారు, తెలుగు పండితుడైన ముట్నూరి ప్రకాశంగారు, పులగాంలో టీచరుగా వున్న గవర అప్పల నరసింహులుగారు వీరిని ప్రోత్సహించారు. తరువాత అదే సంవత్సరంలో కళింగపట్నంలో దుంపా సూర్యంగారనే రామభక్తుడు రామమూర్తిగారి చేత రెండవ అష్టావధానం చేయించారు. 1952 లో శ్రీకూర్మం దేవాలయంలో తిలకా రామారావుగారనే దేవాలయాధికారి రామమూర్తిగారి చేత మూడవసారి అష్టావధానం చేయించారు. అనతికాలంలోనే రామమూర్తిగారి అవధాన ప్రదర్శన వేగాన్ని పుంజుకుంది. 1951-53 మధ్యకాలంలో వివిధ ప్రదేశాల్లో వీరు నూరు అష్టావధానాలు చేసి కవి పండితుల ప్రశంసలు పొందారు. 1953లో ఒక్క పశ్చిమగోదావరి జిల్లాలోనే రామమూర్తిగారు 50 అవధానాలు చేశారంటే ఆశ్చర్యం కలుగుతుంది.

**వివాహం:**

రామమూర్తిగారి పశ్చిమ గోదావరి జిల్లా పర్యటన వారి జీవితంలో ఒక

మైలురాయి. 1953లో ఖండవల్లిలో ఘండికోట రామసోమయాజులుగారు రామమూర్తిగారి చేత అక్కడి ప్రాథమిక పాఠశాలలో అవధానం చేయించారు. అవధానం ముగించుకుని మర్నాడు రామమూర్తిగారు విజయనగరానికి ప్రయాణం కాబోతున్నారు. ఇంతలో పేకేరు గ్రామంనుండి చల్లా నరసింహశాస్త్రిగారు వచ్చి తమ ఆఖరి కూతురు వెంకటరత్నాన్ని రామమూర్తిగారికిచ్చి వివాహం చేశారు. రామమూర్తిగారు కొంతకాలం అత్తవారింట పేకేరులో ఉండి, వైవాహిక జీవితంలో కొన్ని ఒడిదుడుకులు వచ్చిన కారణంగా తిరిగి విజయనగరం వెళ్లి పోయారు.

బులుసు వేంకటరామమూర్తిగారు 1958 లో రాజమండ్రీలో అవధానం చేశారు. బంధువుల ప్రయత్నాలవల్ల తిరిగి వారి వైవాహిక జీవితం కుదుటపడింది. రాజమండ్రీలోనే కాపురమున్నారు. 1959లో రామమూర్తిగారికి కొడుకుపుట్టాడు (బి.వి. శేషగిరిరావు). ఈ సంవత్సరంలోనే వారి జీవితం మరో క్రొత్త మలుపు తిరిగింది.

### గోగినేనివారి ఆస్థాన కవి:

1959 అక్టోబరు నెలలో మద్రాసులోని సర్ త్యాగరాయ కళాశాలలో ప్రొ.తిమ్మావఝుల కోదండ రామయ్యగారు, బులుసువేంకట రామమూర్తిగారి చేత ఒక అష్టావధానం చేయించారు. దానికి ప్రముఖ అభ్రక పారిశ్రామిక వేత్త సాహిత్య పోషకుడు అయిన గోగినేని వేంకటేశ్వర రావు (మానికొండ జమీందారు) గారు వచ్చారు. వారు రామమూర్తిగారి ఆశుకవితా ధారకు ఆశ్చర్య చకితులై వారిని తమ ఆస్థాన కవిగా నియమించుకున్నారు. (ఈ విషయంలో పుచ్చా విశ్వనాథం అనే జ్యోతిష్కుడు రామమూర్తిగారికి సహాయం చేశారు). 1959 డిసెంబరు నెలలో బులుసు వేంకటరామమూర్తిగారు గూడూరు దగ్గరనున్న గోగినేనిపురంలో వేంకటేశ్వరరావుగారి ఆస్థానంలో చేరారు. ఏడు సంవత్సరాల పాటు ఆ జమీందారుగారి పోషణలో ఉన్నారు. 1962లో 'శారద' అనే కూతురు, 1965 లో 'విజయలక్ష్మి' అనే మరో కూతురు జన్మించారు. 1966 మార్చి నెలలో తిరిగి సకుటుంబంగా రాజమండ్రీ వచ్చేశారు.

### ఉద్యోగం :

డిగ్రీలు లేని పాండిత్యం వన్నెకు రాదని గ్రహించి, 1967లో

రామమూర్తిగారు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు నిర్వహించిన 'విశారద' పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. దీనితో 1968లో నెల్లూరు జిల్లా వాకాడులో మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి గారి విద్యా సంస్థలలో తెలుగు పండితుడుగా ప్రవేశించారు. 1971 వరకూ అక్కడ పని చేసి, తిరిగి రాజమండ్రీ వచ్చేశారు. అక్కడే స్థిర పడిపోయారు.

బిరుదులు :

బులుసు వేంకటరామమూర్తిగారు 1951 నుండి 1993వరకూ సుమారు రెండువేల అష్టావధానాలు నిర్వహించారు; అనేక ఆశుకవితా ప్రదర్శనలు చేశారు. బహుబిరుదుల చేత సత్కరింపబడ్డారు. ఉదాహరణానికి కొన్ని :

"అవధాన పంచానన" : కాకినాడలో పి.ఆర్. ప్రభుత్వ కళాశాలలో అవధానం చేసినప్పుడు జటావల్లభుల పురుషోత్తంగారు ఇచ్చారు.

"ఆశుకవి చక్రవర్తి" : 1975లో మొదటి ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంగా హైదరాబాదులో దివాకర్ల వేంకటావధానిగారు, వానమామలై వరదాచార్యులవారు, ఆవంత్స సోమసుందర్‌గారు ఇచ్చినది.

"అవధాన కళా భారతి" : తణుకులోని నన్నయ భట్టారక పీఠం వారు ఇచ్చినది.

"ఆశుకవి కంఠీరవ" : రాజమండ్రీలోని గౌతమీ విద్యాపీఠంవారు ఇచ్చినది.

"ఆశుకవి శేఖర" : మద్రాసులోని జార్జిటౌన్ మెట్రో అసోసియేషన్ వారు ఇచ్చినది.

కవి పండిత ప్రశంసలు :

అష్టావధానంలో అప్రస్తుత ప్రసంగాన్ని కూడా ఆశువులోనే చెప్పటం రామమూర్తిగారి ప్రత్యేకత. వీరి అవధానం పూర్తి అయ్యేసరికి సుమారు నూరు పద్యాలకు పైగానే శ్రోతులు వింటారు. రామమూర్తిగారి ఆశుధారా వేగాన్ని అనేక కవులు, పండితులు, విమర్శకులు మిక్కిలిగా ప్రశంసించారు.

"హిమాలయ శిఖరమునుండి జాలువారు గంగా ప్రవాహము వంటి ధారతో, మధుర మంజుల హృద్యపద్యములను ఆశుధారలో శ్రవణ పేయముగా చెప్పు రామమూర్తిగారి భాషా సేవ యావదాంధ్రుల మనః ఫలకములందు చెఱగని ముద్ర వేయునని నాదృఢ విశ్వాసము" – అని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి వంటి ప్రముఖ విమర్శకులు కీర్తించారు.

"గంగా ప్రవాహము వంటి ధారలో లలిత పద మంజులము సరసము నగు కవిత్వము చెప్ప వీరి ప్రతిభా విశేషము నుత్యము"

— వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

"బులుసు వేంకట రామమూర్తిగారి ఆశుకవితాధార శ్రోతృజన రంజనమై, సరళపదసుందరమై, రసవత్కళా మందిరమై, మందులను గూడ స్పందింప జేయుగలదని నా నమ్మకము"

— వానమామలై వరదాచార్యులు.

అత్యంత వేగమైన ఆశుకవిత్వంతో అష్టావధానం చేస్తున్న బులుసు వేంకట రామమూర్తిగారిని చూచి, 'కవి కోకిల' గుఱ్ఱం జాషువాగారు ఆశ్చర్య చకితులై ఈ క్రింది విధంగా ఒక పద్యం చెప్పారు:

"తంత్రమొ, రష్యావారల
యంత్రమొ, కోటి జననా లహర్నిశ కవితా
మంత్రమొ, శారదపైని స్వ
తంత్రమొ, అష్టావధాని తలలో నుండెన్."

## సమ్మోహనాస్త్రం :

రామమూర్తిగారి ఆశుకవితాధారకు ఎంతటి వాడైనా నిలువునా కరిగి పోవలసినదే. దీనికి ఒక ప్రత్యక్షోదాహరణం ఉంది. 1960లో ఒక రోజు రామమూర్తిగారు మద్రాసు పాండీ బజారులో నడిచి వెడుతున్నారు. ఎదురుగా ప్రముఖ అభ్యుదయ కవి ఆరుద్రగారు కనిపించారు. వెంటనే రామమూర్తిగారు ఆరుద్రగారిమీద ఒక ఆశువు విసిరారు

"భద్ర దిగంత కీర్తి ప్రతిభాన్విత శేఖర ! యావదాంధ్ర ని
ర్నిద్ర కళాసముద్ర రజనీకర ! చిత్ర విచిత్ర వాగ్ఝరీ
ముద్రిత లేఖినీ విభవ ! మోహన దివ్య వచోవిలాస ! ఆ
రుద్ర ! రసజ్ఞ మానస సరోజ విరాజిత దివ్య భాస్కరా !"

ఈ ఆశువు వినగానే ఆరుద్రగారు మహదానందంతో మురిసిపోయి, జేబులో చేయిపెట్టి తడుముకున్నారు. 50 రూపాయలున్నాయి. ఆడబ్బంతా తీసి రామమూర్తిగారి చేతిలో పెట్టి భక్తితో నమస్కరించారు. (అప్పుడు 50 రూపాయలంటే ఇప్పుడు 500 రూపాయలతో సమానం!)

## శ్రీ సత్యసాయి బాబా :

పద్యాన్నికాని శ్లోకాన్ని కాని చాలా ఒడుపుగా చదువుతారు రామమూర్తిగారు. 1963లో ఒకసారి తమ పోషకులైన గోగినేని వేంకటేశ్వరరావుగారితో కలిసి భగవాన్ శ్రీ సత్యసాయి బాబా గారిని దర్శించారు. బాబాగారు పంచ చామర ఛంధంలో గణపతిని స్తుతించమన్నారు. వెంటనే రామమూర్తిగారు –

"ముదాకరాత్తమోదకం – సదా విముక్తి సాధకం
కళాధరావతంసకం – విలాసి లోక రక్షకం
అనాయకైక నాయకం – వినాసి తేభ దైత్యకం
నతాశుభాసునాశకం – నమామితం వినాయకం" – ఇత్యాదిగా

కొన్ని శ్లోకాలు చదివారు. ఇంతలో ఒక భక్తుడు "ఇదే శైలిలో బాబాగారి మీద శ్లోకాలు చెప్పండి" అని అడిగాడు. వెంటనే రామమూర్తిగారు 27 పంచచామరాల్లో బాబాగారిని స్తుతించారు. (వీటిలో పది శ్లోకాలను ఇటీవల తంగిరాల సుబ్బారావుగారు 'సాయి వనంలో ప్రేమ కల్పజం' అనే పుస్తకంలో ప్రచురించారు). 'నమామి సత్యసాయినం – సమాశ్రితార్థ కల్పకం' అనే మకుటంతో సాగిన ఈ స్తోత్రంలో మొదటి శ్లోకం ఇలా ఉంటుంది :

"పవిత్ర పుట్టిపర్తి వాస మండనం, మహాశయం,
కవీంద్ర పండిత స్తుతం, కళాత్మకం, రసాత్మకం,
నవీన లోక పాలకం, నవావతార భాసురం,
నమామి సత్య సాయినం – సమాశ్రితార్థ కల్పకం !"

## సత్యభామ పాత్రధారి :

1964లో సత్యభామ పాత్రధారి పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారు గూడూరులో కూచిపూడి భామాకలాపాన్ని ప్రదర్శించారు. రామమూర్తిగారు ఆప్రదర్శనను చూచి ఆనంద పరవశులై స్టేజిమీదకు వెళ్ళి శర్మగారి మీద ఆశువుగా కొన్ని పద్యాల చెప్పారు. (ఈ నాటికీ వారి ధారణలో ఉన్న మూడు పద్యాలను దిగువ ఇస్తున్నాం):

"శ్రీ వాణీ కరుణా కటాములు రాశీభూతమై నృత్య శో
భావిర్భూత విశిష్ట భంగిమల సభ్య శ్రేణి కత్యంత మో
హావేశంబులు కల్గ జేసితివి యోగ్యం బొప్ప గూడూరునన్
శ్రీ వేదాంతము వంశసంభవ ! యశస్వీ సత్యనారాయణా !"

"రంగ దభంగ సంభృత కురంగ తురంగ తరంగ డోలికా
రంగ విహార కేళి మకరంధ సుధారస మాధురీ వచో
భంగిమ లందు నాట్యము సభాస్థలి సల్పిన నీదు ప్రజ్ఞవే
ద్యం గిలిగింత బెట్టె రస కల్పిత నాట్యలయ ప్రధానమై."

"కనులు త్రిప్పిన చాలు కమనీయయుగ స్త్రీలు
తలవంచు నట్టుల వెలిగినావు
కాలు కదిపిన చాలు గంగా తరంగాది
భంగిమల్ సభలోన పొంగిపోయె
చేయి త్రిప్పిన చాలు శివతాండవాది వి
న్యాసంబు లెల్ల సంతసము గూర్చు
శిరము వంచిన చాలు నిరవద్య నాట్య శా
స్త్ర ప్రవీణతలు సంధాన పఱచి
మధుర మగురీతి నెల్లూరి మండలమున
నీ కళాముద్రలన్ జూపి నిస్తులమగు
వాసిగాంచిన వేదాంత వంశ ధామ !
సత్యనారాయణా శర్మ ! జయము జయము !"

విశ్వనాథవారు :

1972లో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి జ్ఞాన పీఠ బహుమతి వచ్చింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని రామమూర్తిగారు విశ్వనాథవారిని దర్శించి వారి మీద ఆశుపద్యాలు చెప్పి వారిచే సత్కరింప బడ్డారు. 22 ఏళ్ల తర్వాత ఆ పద్యాలలో మూడింటిని జ్ఞాపకం చేసికొని రామమూర్తిగారు మాకు చెప్పారు:

"బహు భాషాగమ వార్ధిమంథరుని తద్బాంధవ్య చారిత్ర సం
గ్రహణోదంచిత తత్కథా కథన పారావార విస్తారు దు
స్సహవాగర్భటు శబ్ద శాసన మహాచార్యున్ సుధీరూపు ని
న్నహిరాజేని నుతింప జాలడన నేనా తత్క్రియల్ పూనుటల్."

"నేరని వాడనయ్యు మది నెక్కొను త్వత్పద యుగ్మ భక్తిసం
భారము ప్రోత్సహింప నిటు పద్యసవోత్పల దీప్త కౌముదీ
పారిషత్పరిమోద మధుభాజన నర్మిలి కాన్క వెట్టుచు
న్నారము నీకు గొమ్ము బుధనాయక ! మమ్ము తరింప జేయగన్."

"పాయని శ్రద్ధ శిష్యుల కుపాయము తోడుత విద్య జెప్పగా
జేయు కళా ప్రపూర్ణ పరిశీలిత చిత్త వివేక ధీ యుపా
ధ్యాయ పద ప్రదీపిత విధానివి సత్కవివైన సత్యనా
రాయణ ! సర్వ సద్గుణ పరాయణ ! సజ్జన లోక భూషణా!"

వినాయకుని జనగణమన :

ఒకసారి ఒక ఊళ్లో రామమూర్తిగారు గణపతి నవరాత్రుల సందర్భంగా అష్టావధానం చేస్తున్నారు. అప్పుడు అవధానంలోని అప్రస్తుత ప్రసంగి "అయ్యా ! అవధానిగారూ ! అష్టావధానం పూర్తి కావస్తోంది. ఇక్కడ గణపతి నవ రాత్రులు జరుపుకుంటున్నారు. కార్య క్రమాంతంలో జాతీయ గీతం పాడు కోవడం అలవాటు. ఇవి గణపతి నవరాత్రులు కాబట్టి "జనగణమన అధినాయక జయహే" శైలిలో గణపతి మీద ఒక పాట కట్టి పాడండి" అని అడిగాడు. వెంటనే మన ఆశుకవి చక్రవర్తిగారు ఈ క్రింది విధంగా గణపతి మీద 'జనగణమన' పాడారు :

"భవ భయహర గణనాయక దేవా – బాధలు దీర్పగ రావా !
విఘ్నాంధకార హరణాయ నమస్తే – విశ్వవిచిత్ర విలాసా !
శాశ్వత సౌఖ్యకరా ! పరమాత్మా ! – శశ్వదనంత విభాసా !
కరిముఖ రూపా దేవా! కరుణను జూపగ లేవా !
రావా ! శుభముల నీవా!
జనగణ వందిత రూప గణేశా ! జాలమదేలను బ్రోవా !
రావా ! రావా ! రావా !
కనికరమున దేవా !! "

బులుసు వేంకటరామమూర్తిగారు ఇంత వరకూ చేసిన రెండు వేల అష్టావధానాలలో చిత్ర విచిత్రాలైన సమస్యలు, క్లిష్టమైన దత్తపదులు వందలాదిగా పూరించారు. అవన్నీ సేకరిస్తే ఒక పెద్ద గ్రంథమే అవుతుంది. మచ్చుకు కొన్ని సమస్యలూ, దత్త పదులూ దిగువ ఇస్తున్నాం:

దత్తపదులు :

1. "పోతన, పోతన, పోతన, పోతన" యీ పదాలు భిన్నార్థాలలో వచ్చి కవి పోతన పదం ఒక్క సారి మాత్రమే వచ్చేటట్లు పోతనగారిపై పద్యం.

ఉ. పోత నవీన పద్ధతుల పోసెను పద్యములందు రాముప్రా
పో, తన ప్రాగ్భవమ్ము పరిపూర్ణ తరంబగు తెన్గుభాష తీ
పో, తనరార జూపె పరిపూర్ణత భాగవతంబునందు నా
పోతన సత్కవీశ్వరు డపూర్వ కవిత్వకళా విశిష్టతన్.

2. 'పూరి, దోసె, వడ, సాంబారు' అనే పదాలు పాదాదినిగానీ, మధ్యలోగానీ వచ్చేటట్లు కోటీశ్వరస్వామి స్తుతి.

శా. పూరింపంగదె మాయభీష్టముల సంపూర్ణానురాగంబునన్
కారుణ్యంబున దోసె లొగ్గితిని శ్రీగంగాధరా! శంకరా!
నైరాశ్యంబున మేనదెల్ల వడకెన్ నన్నెట్లు రక్షింతువో
ప్రారబ్ధంబుల పారద్రోలియును సాంబా! రుద్ర! కోటీశ్వరా!

3. 'వాలీబాలు, క్రికెట్టు, కోకో, కబాడీ' అనే పదాలు వచ్చేటట్లు రామాయణార్థంలో ఒకపద్యం.

శా. వాలీ బాలు ని వోలె పల్కెదవు నీవా రాముశాసించుటల్
లీలామానుషు వక్రికెట్టుం దెలియున్ లేశంబు జూడంగ తా
గోలన్ వెట్ట కపీంద్రవర్యులను కోకొమ్మంచు దానేలె దు
శ్శీలా నారువు దాకబాడి యగునే సిగ్గేమి లేకుండగన్.

4. 'పంది, నంది, కంది, మంది' అనే పదాలు పాదాదిని వచ్చేటట్లు సి.పి. బ్రౌన్ దొరగారిపై పద్యం.

ఉ. పందిరి మల్లె తావులయి పర్వెడి రీతిని తెన్గు భాషలో
నందిన తన్మయత్వమున నర్తకి బ్రౌను వరుండు కీర్తి ప్రా
కం ది శలందు వ్యాఖ్యల నిఘంటుల వ్రాసి తెనుంగు సాహితీ
మందిరమందు నిల్పె తనమానిత నామము శాశ్వతంబుగన్.

5. 'గయా, చలో, రహో, సునో' – అనే హిందీ పదాలు వచ్చేటట్లు రామాయణార్థంలో పద్యం.

తే. వేగ యాగంబు రక్షింప వెడల సుతులు
పోవుచున్నారహోయని పొక్కి పొక్కి
ఎంచ లోకంబు రక్షింప నేగి రనుచు
మనసు నోదార్చె దశరథ మనుజ విభుడు.

6. టి.వి. లో ఆశువు – దత్తపది 'రేఖ, శ్రీదేవి, జయప్రద, విజయశాంతి' అనే పదాలు వచ్చేటట్లు భారతార్థంలో పద్యం.

తే. రేఖ మంచిది పాండవాళికిని గాన
వరలె శ్రీదేవి భర్త శ్రీహరి సఖునిగ
కదు జయప్రదముగ దాటి కష్టములను
విజయశాంతి పథంబుల వెలిగినారు.

7. 'కేక, పాక, పేక, పోక' అనే పదాలలో రామాయణార్థం వచ్చేటట్లు పద్యం:

ఉ. కేకయరాజపుత్రి పరికించియు మంథర మాటలెల్ల, భూ
పా !కదువేగ రాఘవుని పంపుము కానకు, సేయుమయ్య రే
పే కదు వేడ్క నాసుతుని ప్రీతిగ రాజుగ నంచు బల్క నా
పో కడ విన్న పంక్తి రథ భూపతి కుప్పగ కూలె ఖిన్నతన్.

8. "ఉత్తర, హస్త, చిత్త , స్వాతి" అనే నక్షత్రాలు పదాదిని వచ్చేటట్లు భారతార్థంలో పద్యం.

తే. ఉత్తర కుమారుడెంతయో తత్తరమున
హస్తముల పగ్గముల బట్టి నిస్తులముగ
చిత్త విభ్రమలీల వచించె నెంతొ
స్వాతిశయముమొప్పగ ప్రగల్భములుచాల.

9. 'ఆరు, మూడు, ఏడు, పది' – అనే పదాలతో భాతార్థంలో పద్యం.

తే. ఆ రుచిరమూర్తి హరి కౌరవాళికనియె
మూడు మీ కాలమిక రాజ్యములు నశించు
ఏడుపులికేల సంధి సేయించుకొనుడు
పదిలముగ సర్వసుఖములు బడయుడయ్య.

సమస్యలు :

1. "రాయలవారికీ తెలుగు రాదుగదా ! రసమున్ గ్రహింపగన్"

ఉ. శ్రీయుతుడాంధ్ర భోజుడు వచించి రచించినయట్టి విష్ణు చి
త్తీయము కావ్య మష్ట కవి దిగ్గజముల్ విన తాపరింప చై
నీయులు వచ్చిరాసభకు నిర్మలరీతిని చూచుచుండిరా
రాయల, వారికీ తెలుగు రాదుగదా రసముం గ్రహింపగన్.

2. "శునకమ్ములు పూవులయ్యె చోద్యం బహహో"

క. అనయము ముల్లోకంబుల
తనశక్తిని మోహవార్థి తత్పరులుగ పా
వనముగ నొనరించు రతీ
శున కమ్ములు పూవులయ్యె చోద్యం బహహో!
(రతీశునకు + అమ్ములు)

3. "కారములోన తీపి కనగల్గుట లోక విచిత్ర మెట్లగున్ ?"

ఉ. సారసగర్భురాణి విలసత్కరుణా పరిపూత లబ్దసం
స్కారము గల్గినట్టి కవిసత్తము లుత్తమ కావ్యరాజముల్
నేరుపు మీర వ్రాయ నవనీపతులారసి సేయునట్టి స
త్కారములోన తీపి కనగల్గుట లోక విచిత్ర మెట్లగున్?

4. "సతి సతి గవయుంగ పుత్ర సంతతి గలిగెన్"

క. మతిచెడి మన్మథ శరముల
ధృతి మీరగ తాళలేక ధీరుండొక సం
తతిగన తనదగు సాధ్వ
సతి, సతిగవయుంగ పుత్రసంతతి గలిగెన్.

5. "రావణ కుంభకర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై"

ఉ. దేవతలున్ మునీశ్వరులు దీనత వేడగ విష్ణుదేవునిన్
బ్రోవగ వారినెల్ల పరిపూర్ణ కృపామతితో నయోధ్యలో
ధీవిలసత్ప్రభావుడయి దీప్తిగ కాలము దీరిపోవ నా
రావణ కుంభకర్ణులకు, రాముడు పుట్టె గుణాభిరాముడై.

6. "జనకుడు పుత్రుడున్ పరమసాధ్విని పొందిరి ధర్మ పద్ధతిన్."

చ. మునివర మంత్రసిద్ధి కడు మోదముతో గొని నాడు కుంతి తా
మనమున గోరె భాస్కరుని మాన్యుడు నా యమధర్మరాజునిన్
ఘనమగు నామె కోర్కె పయి గణ్యత మీరగ వచ్చి ప్రేమ నా
జనకుడు పుత్రుడున్ పరమసాధ్విని పొందిరి ధర్మ పద్ధతిన్.

(NOTE: సూర్యుడు, యముడు: తండ్రి – కొడుకులు)

7. "తొమ్మిదిలో నొకటితీయ తోచును పదియై"

క. సమ్ముదము మీర నల గడియా
రమ్మున కాలంబు దెలుప రంజిలి కడుమో
దమ్మ డెడి రోమనంకెల
తొమ్మిదిలో నొకటితీయ తోచును పదియై.

రచనలు :

అవధానాలకూ ఆశుకవితా ప్రదర్శనలకూ మాత్రమే తన కవితాశక్తిని పరిమితం చేసుకోకుండా, రామమూర్తిగారు కొన్ని భక్తి శతకాలు, నీతి శతకాలు, జీవిత చరిత్రలు, ఆధ్యాత్మిక గ్రంథాలు కూడా రచించారు:

జనార్దన శతకము : 1952లో విజయనామ సంవత్సరంలో విజయనగరం నుండి ప్రకటించారు.

మిత్రబోధ : 1964లో గూడూరు నుండి ప్రచురించారు. 'మిత్రమా!' అనే మకుటంతో తమ పోషకులైన గోగినేని వెంకటేశ్వర రావుగారిని సంబోధిస్తూ వ్రాశారు.

ప్రసన్న భారతి : 1968లో రాజమండ్రినుండి ప్రచురించారు. ఈ గ్రంథంలో తాము రచించిన తొమ్మిది గ్రంథాల పేర్లు వాటి వెలలు ఇచ్చారు మిత్ర బోధ, ప్రసన్న భారతి, మంజూష (ఖండ కావ్యము), వేంకటేశ్వర శతకము, దైవ సంకల్పము (కల్పిత పద్యకావ్యము), వాణీ విహారము, భార్గవీ విలాసము, రామమూర్తి మాట. కాని వీటిలో మొదటి మూడు కావ్యాలు తప్ప తక్కిన వేవీ ముద్రింప బడిన దాఖలాలు లేవు.

సమైక్య సారథి : 1976లో ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని నిరసిస్తూ, జలగం వెంగళరావుగారి నాయకత్వాన్ని సమర్థిస్తూ, ఆయన చరిత్రను మూడు ఆశ్వాసాల కావ్యంగా రచించారు. దీనిని శ్రీ వి. గాంధి అనే మిత్రుడు (కాంగ్రెసు కార్యకర్త) హైదరాబాదునుండి ముద్రించారు.

శ్రీరామ చంద్ర కరావలంబ స్తోత్రము : 1978

శబరి : 1984. నాలుగు భాగాల లఘుకావ్యం

తంటికొండ వేంకటేశ్వర చరిత్రము : 1984. గద్య పద్యాలలో నూరు పుటల గ్రంథం. తూర్పు గోదావరి జిల్లాలోని గోకవరం దగ్గరున్న తంటికొండ గ్రామంలోని వేంకటేశ్వర దేవాలయ ధర్మకర్తలు రామమూర్తిగారి చేత వ్రాయించారు.

అధారాలు – పరిశోధన :

ఇటీవల ప్రభావతీపుత్ర సూర్యాసుదర్శన్‌గారు 'ఆంధ్రభూమి' దిన పత్రికలోనూ, చాలా కాలం క్రిందట పి. మోహన్‌గారు స్రవంతి పత్రికలోనూ రామమూర్తిగారి ప్రజ్ఞాపాటవాలను గురించి రెండు వ్యాసాలు వ్రాశారు. రామమూర్తిగారు కూడా స్వయంగా 'పరిచయ పారిజాతము' అనే పేరుతో తమ బయోడేటాను కవి పండితుల ప్రశంసలతో సహా ప్రచురించారు. ఇవి తప్ప వీరి సాహిత్య విశేషాలను తెలుసుకుందుకు వేరే ఆధారలేవీ లేవు. ఇప్పుడు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో వీరి ఆశుకవిత్వం పైన కుమారి పానుగంటి మాధవి ఎం. ఫిల్. పరిశోధన చేస్తోంది.

మోహన విశ్లేషణ :

కవి మిత్రులు శ్రీ పి. మోహన్‌గారు స్రవంతి పత్రికలో రామమూర్తిగారిని గురించి చక్కని విశ్లేషణ చేశారు. వారి దృష్టిలో శ్రీ బులుసువారి ఆశు కవిత ఆనందింపవలసిందే కాని వర్ణింప నలవికాదు. వీరి నిర్దుష్టావధానం ఆంధ్రావనిలో విజయధ్వజ మెత్తింది ! హృద్యమూ, శ్రోతృ జనరంజకమూ, సరళ పదసుందరమూ, రసవత్కళా మందిరమూ అయినది వీరి ఆశు కవితాధార ! వీరి ఆశుపద్యాలు అమృతపు జల్లులు. ఇవి దిగజారిపోతున్న అవధాన కళను పునర్జీవింప జేస్తున్నాయి. ధారణా శక్తికి హద్దులు చూపగలిగిన మహనీయు డాయన. సరస సంభాషణ, హాస్యరసం, సమయ స్ఫూర్తి ముప్పిరి గొన్న హృద్య పద్యాలు అసంకల్పితంగా చెప్పగల కవితావిధాత! మధురోహ పూరిత సముచిత భాషానైపుణిగల దిట్ట ! చదవటంలో ఇంపు, పదబంధంలో సొంపు, వీరి ప్రత్యేకతలు. మృదు మధుర మంజుల పద సమన్వితం వీరి కవిత్వం. వీరికి అష్టావధానం ఉగ్గుపాలతో అనర్గళంగా అలవడిన బాల్య క్రీడ. అటు ఆశుకవిత్వంలోనూ

ఇటు అష్టావధానంలోనూ మేటిగా భాసించి తెలుగులకు వెలుగురేనిగా పేరెన్నికగని, యావద్భారతంలో రెండు వేలకు పైగా అష్టావధానాలు అజేయంగా చేసి, ఇంకా చేస్తూ క్రొత్త చరిత్ర సృష్టించిన 'ఆశుకవి చక్రవర్తి' శ్రీ బులుసు వేంకటరామమూర్తిగారు అసమాన ప్రతిభానిధులు ! అటు మద్రాసునుంచి ఇటు కలకత్తావరకూ అవధానాలు చేసి 'తెలుగు తల్లి' ని ఊరూరా చంకన బెట్టుకుని తిరిగిన వ్యక్తి తిరుపతి వేంకటకవుల తర్వాత రామమూర్తిగారు ఒక్కరేనంటే అతిశయోక్తి కాదు!

ముగింపు :

కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు రామమూర్తిగారిని గురించి చెప్పిన పద్యంలో ఈ పరిచయ వ్యాసాన్ని ముగిస్తున్నాము :

"పంకజ గర్భురాణి మృదు పాణి ఝుణంఝుణ కంకణ క్వణా
హంకరణానుషంగము లనంగ నిషంగ శర ప్రసంగముల్
శంకర సాంధ్యనాట్య పరిషచ్ఛల దద్భుతటీ తరంగముల్
వేంకట రామమూర్తి సుకవీంద్ర ! భవత్కవితా తురంగముల్!"

* * *

---

శ్రీరమణీమణీ విమలచిత్త సరోజ విరాజ భాస్కరున్
క్రూర మదాంధకార రిపుకుంజర భంజను చిత్తసీమలో
జేరిచి, భక్తియోగ పరిశీలనచే భజియించి, ఘోర దు
ర్వార దురంత దుఃఖముల బాసి, సదా తరియింపు మిత్రమా!

* * *

కర్మను దాటగా వశమె కంజభవాదులకైన ధాత్రి, నీ
మర్మము నీ వెఱింగి, అల మాధవుపాదము లాశ్రయించి, నీ
ధర్మము తప్పకుండ నిరతంబు హితంబొనగూర్చు కార్యముల్
నిర్మల బుద్ధితోసలిపి, నీతిమెయిం జరియింపు మిత్రమా!

(బులుసు వారి 'మిత్రబోధ' కావ్యమునుండి)

(బులుసు వేంకటరామమూర్తిగారు 2004 ఆగస్టు 19వ తేదీనాడు రాజమహేంద్రవరంలో స్వర్గస్థులయ్యారు.)

# కె. శివారెడ్డి

## మృత్యువులోంచి జననంలోకి

ప్రతిరోజు రాత్రి ఒక యజ్ఞం. మండుతున్న అగ్నిగుండం.
హవిస్సులేదు, ఆజ్యంలేదు, సమిథల్లేవు—
ఒక్కొక్క అవయవాన్ని సమర్పించటమే.
సమర్పించిన మరుక్షణంలో అదే అవయవం
రెట్టించిన బలంతో లేస్తుంది నాలోంచి—
ఇలా అన్ని అవయవాల్ని సమర్పించుకుంటూ పోతుంటాను;
పునర్ యౌవనవంతుణౌతాను, బలోపేతుణ్ణౌతాను.
ఇలా యజ్ఞం చేస్తూ చేస్తూ నిద్రలోకి జారుకుంటాను;
నిద్రలోంచి మెలకువలోకి
నిద్రలోని మెలకువలోకి—
అప్పుడొక స్వప్నం . స్వప్నాంతర్భాగ వాస్తవంలోకి
—నాచేతుల్ని రెక్కలుగా
అద్భుతవనాలమీంచి, కొండలూ, లోయలూ,
ఎడారులూ నదులూ, సముద్రాలమీంచి
ఎగిరిపోతుంటాను; లోయల్నిండా పరుచుకున్న
పూలతోటలమీంచి, ఊళ్ళు,
పొలాల కర్మాగారాలమీంచి, గాలిలా విస్తరించిన జనాలమీంచి
ఒక అతులిత, ఆనందోత్సాహకాంతిలో పొంగి పోతుంటాను.
అలా ఆకాశ విహారం చేస్తూ గుండెనిండా కొత్తగాలి పీల్చుకుంటాను.
ఏదో ఒక ఊరి చెరువు మీదుగా పోతుంటాను;
ఊరి చెరువు అర్ఘ్యమిస్తున్న
మునీశ్వరుని దోసిలిలోని నీళ్ళలావుంటుంది. రైతుకూలీ
దోసిలిలోని గటకలా వుంటుంది.
చెరువులో బర్రెల్ని కడుగుతున్న ఇద్దరు పిల్లలు.
ఈతరాని నేనూ నా తమ్ముడు
బర్రెమీదెక్కి చెర్లోకి; చెరువు మధ్యకెళ్ళి బర్రె మునిగింది.
బర్రెతోబాటు నేనూ, నా తమ్ముడూ. నేలందదు,
ఆకాశమందదు, కేకందదు
అదొక నీటిలోకం, ప్రపంచం అంతా తెల్లని నీటిపొర .

అధోలోకాలుంటాయనీ; అవిబ్రహ్మాండంగా మనల్ని
కిందకు లాగుతాయనీ
నీళ్ళలో మునిగి పోతున్న నాకు తెల్సు
పైన విహరిస్తున్న నాకు తెల్సు.
మా నాన్ననేంచేసి పోతాం, మా నాయనమ్మనేంచేసి పోతాం.
జానపద గాయకుడు
అద్భుత కథకుడు మాలకొండాయ మా వాల్మీకి నేంచేసి పోతాం
మా వూరునేం చేసి పోతాం
కానీ బతకాలి , తప్పకుండా బతకాలి , బతకటానికెదురు
తిరిగి నిలబడాలి.
చావు మీద బతుకు పోరాటం. అధోలోకమ్మీద భూలోకం పోరాటం.
కష్టభూయిష్ఠ ఆనందామృత అత్యంత ప్రీతిపాత్ర జీవనపోరాటం—
'బతకరా, బతకరా, బతకరా' అని పైనున్న నే నరుస్తున్నా
ఆకాశం ప్రతిధ్వనించేలా— నీళ్ళు జడుసుకునేలా—
బతుకుతాడు, మనిషి బతుకుతాడు, మనిషి బతకటానికే పుట్టాడు;
మనిషి జయించటానికే జన్మించాడు; మృత్యువుని కిరీటంగా
పెట్టుకుని మనిషి జన్మించాడు
మనిషి నిలువెల్లా వీస్తున్న పోరాటపవనం,
మనిషి నీటి అడుగున భూమిలోకి వేళ్ళుగుచ్చి
ఒక తన్ను తన్ని , ఒక ఊపులో ఒడ్డున పడ్డాడు.
నీటిపైన వెలుగుని చూశాడు.
ఒడ్డుని చూశాడు, ఒడ్డున గాలికి ఊగుతున్న
రెండు తుంగ పీచుల్ని చూశాడు.
అనంతంగా ఆకాశందాకా పర్చుకున్న పచ్చని
పచ్చికని, పైరుల్ని చూశాడు
కళ్ళల్లో తొంగిచూస్తున్న నీళ్ళని చూశాడు, నీళ్ళలో
వికసిస్తున్న పద్మాన్ని చూశాడు.
మనిషిగొప్పతనాన్ని పాడుతూ, మృత్యుంజయత్వాన్ని పాడుతూ
నిరవధిక నిర్భేద్య కృత నిశ్చయాన్ని పాడుతూ
తిరుగుబాటుతనాన్ని పాడుతూ
పోరాట పటిమని పాడుతూ నేనలా ఎగిరిపోతున్నాను.
పైన సూర్యుడూ, ఆకాశమూ, కింద మానవుడూ,
మావూరూ, మావూరి చెరువూ—
చెరువు చుట్టూ అదృశ్యంగా నిలబడ్డ మాపూర్వీకులూ

చెమటతో నిగనిగలాడుతున్న మాపూర్వీకుల తీరని కోరికల దేహాలూ—
నేను నిద్రలోంచి మెలకువలోకి, ఆకాశంలోంచి భూమిలోకి
మృత్యువు లోంచి జననంలోకి, నాలోంచి జనంలోకి
జనం లోంచి నాలోకి—

10.10.1992

* * *

ఇక్కడ రెండే వర్గాలు, రెండే పక్షాలు
జనమున్నారు జనకంటకులున్నారు
ప్రజలున్నారు ప్రజల్ని హింసించే ప్రభుత్వమూ వుంది
గడ్డం పెంచుకుని బొట్టు పెట్టుకుని ప్రభుత్వ జపమాల తిప్పుతావా?
జనంలో కలిసి పోయి జనయుద్ధాన్ని ఎక్కు పెడతావా ?
నిర్ద్వంద్వంగా నిర్ణయించుకో నిశ్చయించుకో
నిజం పలకటం నీకూ మాకూ క్షేమదాయకం.

— కె. శివారెడ్డి (మోహనా! ఓ మోహనా!)

* * *

ఈ వేళ మనమంతా ఈ నదిలో
మునిగి పోతే పోవచ్చుగాక
కానీ, మరిచి పోకు రేపు ఈనదే
సముద్రంలో మునిగిపోయే రోజు రాకపోదు !
— శేషేంద్ర

# మహర్షి

## అసంపూర్ణ యాత్ర

యాత్ర కొనసాగుతూనే ఉంటుంది ...
స్టేషన్ స్టేషన్‌కీ మధ్య దూరాన్ని
గుండెకూ – గొంతుకూ మధ్య ఆకలి అగాధాన్ని
పాట వంతెనతో పూరించాలనుకున్న
పేదగొంతు తాపత్రయం
రైలెక్కి దిగుతూనే ఉంటుంది ...
కాలక్షేపాన్ని న్యూస్‌పేపర్ల పొట్లాల్లో కట్టి
అమ్ముకునే బాల్యాలు,
టీ కప్పుల్లో కన్నీటి తుఫాన్లను నింపి
అందించే జీవితాలు,
యాత్రా ప్రదర్శనలో
రంగుల్లేని పెయింటింగ్‌లై దర్శనమిస్తూనే ఉంటాయి ...
రైలు కదుల్తూనే ఉంటుంది ...
రైలు కిటికీలోంచి నా చూపులకి రెక్కలొచ్చి
గతం చెట్టుమీద వాలుతాయి...
అమ్మ గుర్తుకొస్తుందెందుకో...
అమ్మలాంటి పల్లె గుర్తుకొస్తుంది...
మట్టి పిసికిన చేతుల్తో అమ్మ
అన్నంముద్దలు
చేసి పెట్టిన బాల్యం గుర్తుకొస్తుంది...
తాగొచ్చి నాన్న
అమ్మ తయారు చేసిన కుండల్ని
అమ్మ కన్న కలల్ని
బ్రద్దలు కొట్టడం జ్ఞాపకమొస్తుంది...
కంట్లోంచి దుఃఖం జలజలా రాలుతుంది.
కన్నీటికి అమ్మ చెప్పిన నిర్వచనం
జీవ జల సందేశమే ...
పుస్తకాల ముందు కూర్చోపెట్టి
అమ్మ భవిష్యత్ దీపాన్ని వెలగించడం
గుర్తుకొస్తుంది...
చీకటై విస్తరించిన పేదరికం

చిరుగుల చొక్కాతో నన్ను
పట్నం బస్సెక్కించడం జ్ఞాపకమొస్తుంది ...
కన్నీళ్ళు తుడుచుకుంటూ
అమ్మ చేతులూపడం
వెళ్తోన్న బస్సు వెనుక అప్పటి చివరి దృశ్యం...
పట్నం చీకట్లో రాత్రులెన్నింటినో
కరిగించుకొని
ఆశయాల శిల్పాన్ని చెక్కుకున్న అనుభవం
ఇప్పటి ఈ ఇరవై అయిదేళ్ళ దేహం...
యాత్ర కొనసాగుతూనే ఉంటుంది.
గత జ్ఞాపకాల మరకల్ని నిశ్శబ్దంగా కడుక్కుంటాను...
అమ్మ కలలుగన్న దృశ్యమై
నన్ను నేను ఆవిష్కరించుకోవాలన్న తపనతో
రైలుదిగి నా ఊరికి చేరుకుంటాను ...
అప్పటికే ఆలస్యమవుతుంది...
నన్ను గుండెనిండా చూసుకొని
ఆనందబాష్పమై కురవాలనుకున్న అమ్మ –
శ్మశానంలో మొక్కై మొలవడానికి
తన యాత్ర పరిసమాప్తం చేసుకుంటుంది ...

* * *

కొన్ని జీవితాలెప్పుడూ అసంపూర్ణ చిత్రాలే –
కొన్ని యాత్రలెప్పుడూ అశ్రుకణ దృశ్యాలే –

* * *

బరువు

గుడిసెలో మానానికి గుడ్డ కరువు
షోకేసులో బొమ్మకి గుడ్డ బరువు
– రసరాజు

## కలగోట్ల విజయాత్రేయ

### సంక్రాంతి లక్ష్మి

వచ్చింది వచ్చింది వచ్చిందీ
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ – మా మంచి
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ – మా మధుర
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ – మా తెలుగు
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ – మా వెలుగు
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ!
వచ్చింది వచ్చింది వచ్చిందీ!!

అందాల కతలాగ
ఆనంద లతలాగ
రాయంచ నడకతో
రాచిలుక పలుకుతో
గోరాంక గోముతో
నెమలి నాజూకుతో
వచ్చింది వచ్చింది వచ్చిందీ!
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ!!

కంకెడేసే – జొన్న
కంకిలాంటీ – కోర
కొప్పుతోటీ
కొప్పులోనే – కొండ
కులుకు మల్లీ – దండ
తళుకు తోటీ
తళుకు మీదీ – కురుల
చిలిపిగాలీ – అలల
మలుపు తోటీ
మలుపు లోనీ – మంచి
మహిసాక్షీ – పొగల
మత్తుతోటీ
వచ్చింది వచ్చింది వచ్చిందీ!
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ!!

బంభర యూథము
వంది మాగధులు — కాగా
పిక నాదమ్ముల
వీణారవములు — రేగా
పారావతముల
తూర్యసంపదలు తూగా
తెలుగు రాశిఫల
వెలుగు జాతరలు
కంచుకాగడలు — రాగా
తనక తప్పెటలు — మ్రోగా
కమ్మని తెమ్మెర
కొమ్ము టేనుగుల — మీదా
పారిజాతములు
బారాబరి — సేయూ
వచ్చింది వచ్చింది వచ్చిందీ!
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ

గుమ్మడి పూకిరీటాన
పండుమిరప ముక్కుఅతో
గోగుపూల మేఖలతో
బంతిపూల పట్టుపయిట
సెనగపూల పరికిణితో
నన్నజాజి విన్నాణపు
రవల సమయు హారావళి
గజ్జెలు ఘల్లని — పల్కగా
అందెలు సందడి — సల్పగా
క్రొత్తకోరికలు — తొల్కగా
హాయిగా తీయుగా
వచ్చింది వచ్చింది వచ్చిందీ!
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ!!

తెలిమంచూ చీరగట్టీ
తొలిసంజా రైక తొడిగీ
నల్లకలువ కాటుకెట్టీ
కమలాలూ కేలబట్టీ

హొయలంతా ఒల్కబోస్తూ
వగలంతా చిల్కరిస్తూ
వచ్చింది వచ్చింది వచి ందీ!
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ!!

పైరగాలి వీస్తుంటే
పరిమళాలు లేస్తుంటే
సిరుల పొంగు పూస్తుంటే
అరచందురు తిలకంతో
అరజారిన పయ్యెదతో
అరవాలిన కన్నులతో
హరివిల్లా హంగులతో
వచ్చింది వచ్చింది వచ్చిందీ!
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ!!

గంగిరెద్దువాని – సన్నాయి జోరుతో
నంబి నాంచారయ్య – తాళాల హోరుతో
బాలసంతూవాడి – జేగంట నాదాలు
ఊరువాడానిండ ఉరకలేవేయంగ
పగడాలా దారుల వెంబడి
ముత్యాలా ముగ్గుల మీదా
జముకుల పథాన
దుముకుతు వచ్చింది!
కులమత భేదం – కూడదనీ
వర్గద్వేషం – విడువుడనీ
విరోధభావం – అసలే వద్దని
దురభిప్రాయం – దురహంకారం
ఇంటికి ఒంటికి – మంచిదికాదని
ప్రతిభను కించకు – గురిచేయొద్దని
సమతా మమతా
శాంతీ సౌఖ్యం – కాపాడమనీ
వీథి వీథినా – నగారవేస్తూ
వచ్చింది వచ్చింది వచ్చిందీ!
సంకురాంతీ లచ్చి మొచ్చిందీ – మా తెలుగు
సంకురాంతీ – లచ్చి మొచ్చిందీ!!

# రాజేశ్వరీ దివాకర్ల

## నీరు స్తంభించిన వేళ

అక్కడ
ఊయలలు
శాసింపబడతాయి.
గడియారం
గంటల కులికిపడుతూ
గుండెలోని
చెంచాలకు
చప్పని రుచులు తగిలించి
రూపాయిల
వాసనతో
ఆడింపబడే
చేతులు
మొలచుకొచ్చిన చోట,
దూదికి
గాయాలొచ్చి
అతుక్కొంటాయి.
పాలలో
నిద్రమందు కలిపినా,
పంచదారలో
మత్తు రంగరించినా,
పసికన్నులు
పలుకలేక
నిదురిస్తాయి.
పెరుగుతున్న
ధరలూ,
ఆర్థిక అసమానతలూ,
సమస్యలు
కానేకావు కావక్కడ.
బాక్సులలో
బేకరీ బిస్కత్తులూ
బబుల్గమ్ములూ
ఉదారంగా నింపబడే చోట

ఒక మెత్తని ఒడి
కరువవుతుం దక్కడ
ఒక
ఎర్రని సాంద్రరాగానికై
ఎదురు చూస్తూ
నడక నేర్చే
తప్పటడుగులు
భారమయే చోట,
పాపాయి
డాక్టరవ్వాలని
ఇంజనీరు
కావాలని
కన్న
కలలకు
వెల చెల్లిస్తారు గువ్వల జంట;
పాపాయి
పొత్తిళ్ళలో
కోల్పోయిన
నవకిశోర
బాల్యాన్నిమాత్రం
తిరిగి కొనితేలేని చోట,

## సదరు కృష్ణమూర్తి *

సరగు
అనబరగు
సదరు కృష్ణమూర్తి
సంచిత
సాహితీ స్ఫూర్తి!

ఆచార్యుడు
ప్రాచార్యుడు
పండితుడు
విద్వన్మండితుడు
ఆప్తుడు
ఆనంద వర్ధనుడు!

హిందీ అతని ఒరవడి,
తెలుగతనికి తల్లిబడి,
సంస్కృతం కట్టుకొంది
నాలుకపై గుడి,
కన్నడంలో ఉంది
అంతులేని పలుకుబడి!

భక్తి కతడు రామదాసు,
భావానికి తులసీదాసు,
పదానికి కనకదాసు,
కవిత్వంలో కాళిదాసు,

ఏమీ తెలియ నట్లుంటుంది అమాయకత్వం,
వేషంలో నిరాడంబరత్వం,
మాటల్లో ప్రియంభావుకత్వం,
అదే అతని వ్యక్తిత్వం!!

---

ఆచార్య సరగు కృష్ణమూర్తి, హిందీశాఖాధ్యక్షులు, బెంగుళూరు విశ్వ విద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు 560 056.

* * *

నదులు కనే కలలు ఫలిస్తాయి పొలాల్లో
కవులు కనే కలలు ఫలిస్తాయి మనుషుల్లో
— శేషేంద్ర

## మారుతీ శ్రీలత

### తీపి ప్రశ్న

కదలిక తెలియని కనురెప్పలకు
కలలెన్నో ఇచ్చిన నేస్తం!
నిన్ను ఎలా మరువను?
ప్రేమ తెలియని నిశ్శబ్ద జీవితానికి
మధుపానం చేయించిన ప్రియతమా!
హృదినే గుడిగా మలచి నిన్నారాధించనా?
సుడిగాలిలా మారి నిన్నే చుట్టి ఉండనా?
నీ హృదిపై తలవాల్చి నన్నే నీ కర్పించుకోనా?
నీ దానిగా జన్మజన్మలకూ ఉండిపోనా?
నీలో నిండిపోనా?

### మైనస్ ప్రగతి

మనసులేని
మనుషుల మధ్య బ్రతుకీడుస్తూ
మార్పురావాలని అరుస్తున్నాను;
పట్టించుకోని గొర్రెదాటు
తత్వాలగురించి ఆక్రందిస్తూ
వర్తమానంనుండి భవిష్యత్
బాటవైపు పయనం సాగిస్తున్నాను–
మేధావినై కూడా మైనస్ ప్రగతితో....

# యశశ్శ్రీ
## వేసవి కోయిల

అమ్మ కడుపులోనే అభిమన్యుడిలా
నాన్న పాడే రాగాల మాటలను ఆలకించి
మనసు మూలలో వాటిని మూటకట్టి
వారి ఆశల వసారాలో
సుప్రభాతమై జన్మించాడు.
తల్లి పసిబిడ్డను
పట్టుకున్నంత పదిలంగా
ఊరేగింపుకు అలంకరించిన
ఉత్సవ విగ్రహమంత పవిత్రంగా
హార్మోనియాన్ని వనమాలలా వేసుకొని
రాగాలతో సరాగాలు పలికే
గున్నమావి గుబురుల కోయిలయ్యాడు.
తండ్రి ఇచ్చిన ఆస్తిని
మెడ అనే మేకుకు వ్రేలాడగట్టి
కదిలే పాటలపెట్టె అయ్యాడు.
చేతివ్రేళ్లకు
సప్తస్వరాలతో స్నేహంకాగానే
స్వరాల మెట్లు
ఆహారం దొరికిన 'ఆక్టోపస్' లా
పాటల పిలుపుల్ని ప్రియమైన 'ప్రే' లా
అమాంతం అందుకొంటాయి
వాడు అపర గంధర్వుడై
రాగాలాపన చేస్తూ నడుస్తుంటే
పిసినారి ముఖాలు కొన్ని
చెవుడు తొడుగులను ముఖాలకు తొడుక్కుని
చూపుల్ని పాదాల్లా ముందుకు నడిపించినా—
కొందరు
ఆ గాన సముద్రంలో మునిగితేలుతూ
ఈతి బాధలనుండి
మనసును ఆనందమనే తీగపై

అరక్షణం ఆరేసి
మరలా ఈ లోకంలోకి వచ్చి
పైకి మాత్రం భారవి తండ్రిలా బింకంగా నటించి
మెచ్చికోళ్ళ మాటలకు
రూపాయిల నోళ్ళతో పలకరించక పోయినా—
వాడు మాత్రం
తాతలనుండి నేర్చిన వారసత్వపు రాగాల్ల పూలను
జ్ఞాపకాల దారంతో అల్లుకుంటూ సాగుతాడు.
అలా సాగే వాడి బాటలో
కొన్ని చోట్ల
అమ్మాయిల పెదవులపై
చిరునవ్వులు అలిగి
ప్రియుల స్పర్శల పరామర్శలకు
పులకరించని ముఖాలను చూచి
తాను కట్టిన రాగమాలలను
వదలి పెడుతూ 'సంధి' కార్యం జరపగానే
నవ్వుతూ వారిరువురూ
కానుకలుగా కాసులనిస్తే
వాడి చేతులకు చూపులొచ్చి
కృతజ్ఞతగా చూస్తాయి.
పలకను అందుకోవలసిన చేతితో
పాటల పెట్టెను అందుకొన్నప్పటినుండి
వయసుడిగిన ఈ రోజు కూడ
ఆ పెట్టె
చేతికి ఊతకట్టలా మారినందుకు
వాడి బ్రతుకుపాటకు
'కట్' చెప్పే డైరెక్టర్ లేనందుకు
వాడు
అలసిపోని ఆకాశంలా
నెత్తురింకిన నేత్రాల్లో
వెలుగు చూపుల చుక్కల్ని నింపుకొని
తెల్లారగానే
కరవు కంబళి ప్రక్కన పెట్టి
పులుకడిగిన ముత్యంలా
గుబాళించే గులాబిలా

సప్తస్వరాల సముద్రాలను
సరదాగా పాటల నావతో దాటేస్తూ
బ్రతుకు పోటీలో గెలిచేందుకు
విజయ సమీరాన్ని
వెతుక్కునే వేకువవుతాడు.
అమ్మచేతి గోరుముద్ద గుర్తువచ్చినప్పుడో-
గతం అనే శూన్యంలోంచి
నాన్న పలకరింపు పాశంలా చుట్టినప్పుడో-
అమ్మ ఒడిలా
పెట్టె
తలగడగా మారి
వాడి కష్టాల ఊసులను
రాగాల కన్నీటితో పంచుకుంటుంది.
ఎంతైనా యంత్రంలా బ్రతికినా
వాడూ మనసున్న మనిషే!
రాగం తెలిసిన రసహృదయుడే!
వ్రేళ్ల సుందరీమణులను
మెట్ల డయాస్‌లపై నాట్యంచేయిస్తూ
పేదరికపు వేసవి భగ్గున మండుతున్నా
తాను మాత్రం వసంతకోకిలగా మారి
తాన్‌సేన్ గొంతులో మేఘరంజనిలా
కంఠంలోని పాటల మల్లెపూల పొట్లం విప్పితే
దశదిశలా రసానంద పరిమళ తరంగాలు వ్యాపించి
జనం గుండె హార్మోనియంలో
శభాష్ అంటూ
ఒకే 'హార్మొనీ' కదలి
వాడి రాగాలకు రూపాయిల వాన కురుస్తుంది!
వాడి ఒళ్ళంతా
కళ్ళు విదిల్చిన కాంతి మెరుస్తుంది!!

20-3-94

# తంగిరాల సుబ్బారావు

## పూలతోటలో పద్మక్క*

### 1

'గూటాల' గోదావరీ తీరంలో
'చిర్రావూరి సూరి' గారి జీవన శరత్తులో
అరవైయేళ్ళనాటి రెల్లుపూల నవ్వుల్లో
అక్కా ! నీపుట్టుక...
మొదలు, పిల్లలు బ్రతక్క 'పుల్లమ్మ'గా
అమ్మ 'బాలమ్మ' గారాల ముద్దు గుమ్మగా
పిమ్మట 'భీమయ్య బావ' మానస సరోవరంలో
ప్రఫుల్ల సరోజంమీది 'పద్మక్క'గా......

### 2

బావా నువ్వూ
ఆ తొలిరోజుల్లో
నవ యౌవన వసంత వనిలో
కోకిల దంపతులు
చిలుకా గోరింకలు
మాలతీ మాధవాలు
మీ పాలూతేనెల జీవితమంతా ఒక అనంత సంగీత ఝరి :
"ఆ తోటాలో నొకటి ఆరాధనాలయమూ
ఆ ఆలయామూలో అందగాడెవరే?
.......................................
మరునీ శరములా చేతా మనసూ ఘోషించేనూ
మరపూ రాకున్నాడే చందమామా!" ప్రేమ గీతాలు;
"ముసురేసిందంటే పైన
అసలే మతి పోతది మామా!
నసి చెడినట్లుంటది లోలోన
ఓ బంగరుమామా!" జానపద గీతాలు;

* మా మేన బావ కీ.శే. భిళ్ళమూడి భీమశంకరంభార్య పద్మావతి 15-10-1993 నాడు విజయవాడలో పరమపదించినప్పుడు దశాహస్సులో చెప్పిన కవిత.

"జానకీ రమణా! దశరథనందనా!
దీనవత్సలా! దయాజలధే!"
అష్టపదులు, తరంగాలు,
నా ప్రాచీన జ్ఞాపకాల నీటిప్రవాహాలనిండా
అఖండ గౌతమీ తరంగ డోలికల తేలియాడే
మీ మధుర గంధర్వగీతాల పుష్పనౌకలు!

3

నిత్యం నీ నాలుక మీద నర్తించే
పదాల గోదారి వరదలు
నీ అంతరంగంలో మమతానురాగాల లసత్తరంగాలు
'భళ్ళమూడి' వంశ కాసారాన్ని
పరిమళ భరిత పద్మవనంగా మార్చిన సంపూర్ణస్త్రీత్వం నీది!
భర్త శిశుపాల దోషాలు నూరు దాటిపోయినా
చక్రం విసరని సతీత్వం నీది!
'ఫెమినిజం' కారుచిచ్చు చుట్టు ముట్టిన ఈ నాటి సమాజాటవిలో
నీలాటి సాధ్వీమతల్లి ఉనికి ఇకముందు కల్ల !!

4

నీకిన్నెర కంఠంతో మీటిన 'ఆ తోటలో' వెలసిన
'ఆరాధనాలయం' లోని 'అందగాడు' 'చందమామ'
నీకన్నా ముందుగానే మాయమయ్యాడు.
శ్రుతితప్పినా నీపాట కొనసాగుతూనే వచ్చింది....
క్రమక్రమంగా
కాలం గాలివానల హోరు తట్టుకోలేక
నీ ఆరాధనాలయమూ శిథిలమయింది.
ఈ నాడు దాని భౌతిక రూపం కూడా అదృశ్యమయింది.
కాని, చుట్టూవున్న తోటలో మాత్రం
నువ్వు నాటిన పూలమొక్కలు
వసంత శోభతో నవనవలాడుతూ
బ్రతుకు కోకిల పాటలతో చిగురాకులు తొడుగుతూ
మొగ్గల నిగ్గులు చూపుతూ
రంగురంగుల పూలుగా మారుతూ
దశదిశలా పరుగులు తీసే సుగంధాల తరంగాల తురంగాలు!

స్వర్గంలో ఉన్నా ఈ సౌరభం నిన్ను సంతోషాబ్ధిలో ముంచేస్తుంది!
ఇదిగో! ఇది నువ్వు సాకిన ముద్ద బంతి పువ్వు!
భళ్ళమూడి వారింట ప్రతి యువతి
ముఖంలోనూ మా అమ్మ చిరునవ్వు!

## 5

భీమయ్యా నువ్వూ,
గోదారితల్లి ఒడిలో కన్నులు విప్పారు
కృష్ణాతరంగిణి వడిలో కన్నులు మూశారు
అన్నట్టు, ఓ మినీ కవి అన్నట్టు,
"కన్ను తెరిస్తే జననం – కన్ను మూస్తే మరణం
రెప్పపాటేకదా ఈ ప్రయాణం!"

## 6

జానూ...
పూల తోటలోని ఓ పద్మక్కా!
ఓ మాట చెప్పడం మరిచిపోయాను నీతో
వచ్చేది అసలే శీతాకాలం
నే నిచ్చిన చిన్ని శాలువా చలికాస్తుందో లేదో మరి
త్వరలోనే రిటైరవుతున్నాను నేను
నాడు నాకు జరిగే ఘనసన్మానంలో
కప్పే బంగరు సరిగంచుల కాశ్మీరుశాలువా
నీకోసం పంపిస్తాను....
అంతవరకూ
కాస్త ఓపికపట్టు!!

25-10-1993

# తంగిరాల సుబ్బారావు

## అబ్బిగాడు మామయ్య *

అమ్మ ఆఖరి తమ్ముడు
అమ్మమ్మ ముద్దుల గుమ్మడు
అలరాజు ఎక్కిన 'సవరాల జిమ్మడు'[1]
నీటుకాడు
పోటుకాడు
రాజకుమారికోసం
సహస్రాధిక సాహసాలు చేసిన
'పాతాళ భైరవి' డింగరీ!
పంచకల్యాణి నెక్కి
నా బాల్య స్వప్నాలలో విహరించిన
కాశీమజిలీకథల రాజకుమారుడు!
పైకి ఛత్రపతి శివాజీ కత్తిలా మెరుస్తున్నా
లోపల కరుణార్ద్రఝరి జాలువారే విచిత్రవ్యక్తి
తన జీవన కవచాన్ని చీల్చి
సంపాదన కుండలాలు ఒలిచి
బంధుకోటికి పంచిన అపర రాధేయుడు!
కృతఘ్నతా కురుక్షేత్రంలో
అదృష్ట రథం క్రుంగిపోగా
కాల కిరీటి బాణజాలంతో
వృద్ధాప్యంలోకి కూలిపోయిన మహారథుడు!
అవును, కర్ణుడిలాగే మా మామయ్యదీ సూర్యనారాయణాంశే!!

పచ్చదబ్బపండు ఒళ్ళు
ఇనపకండల సుళ్ళు
పుండరీకాలు రెండుకళ్ళు
నుదుడి మీద వీరమచ్చ

---

23-12-1991 నాడు రాత్రి 7 గంటలకు విశాఖ జిల్లా అనకాపల్లిలో వృద్ధాప్యంలో దుర్భర సంసార పరిస్థితుల్లో ఉన్న ఛిళ్ళమూడి సూర్యనారాయణ అనబడే మా ఆఖరి మేనమామ 'అబ్బిగాడు మామయ్య'ను చూచి, ఘోరున ఏడ్చి వ్రాసిన కవిత. మా అబ్బిగాడు మామయ్య గొప్ప బంధుప్రీతి కలిగిన మహా వ్యక్తి. ధైర్య సాహసాలతో పులిలా బ్రతికాడు. అందరికీ సహాయం చేసి విస్సహాయుడుగా ఉండిపోయాడు. చివరికి 'నా అన్న వాళ్ళే' ఆయన మీద కత్తి కట్టారు. కర్ణుడిలా బలి అయిపోయాడు.

1. పల్నాటి యుద్ధంలో అలరాజు గుఱ్ఱం పేరు

ఎదుటి వాడిని లెక్కపెట్టని రాజసం కచ్చ
మాట పిడిబాకు పోటు
సాహసం సింహకిశోరం దాటు
రసికతలో మన్మథుడు
శౌర్యంలో అభిమన్యుడు!

చిన్నప్పుడే బెజవాడలో మేనమమామ ఇంట్లో చదువు—
తెల్లటి తొడల మీద మెరిసే
నల్లటి నీ నిక్కరు కోసం
తెలతెలవారు తుంటే
వాడపల్లి వచ్చే పడవలోంచి
అమ్మతోపాటు తొంగి తొంగి చూచేవి మా చిన్నారి కళ్ళు.
విఘ్నేశ్వరం కాలువగట్టు మీది మద్దిచెట్లలోంచి
సూర్యబింబం కన్నా ముందే ఉదయించేవాడు
మా అబ్బిగాడు మామయ్య!
పడవతోపాటు జోరుగా అడుగులు వేసేవాడు
సైకిలు మీద మమ్మల్ని ఇంటికి చేరవేసేవాడు.
ఆ నాటి మా రస పుత్రవీరుడి నిక్కరు జేబులో
గమ్మత్తైన తాళం చెవుల గుత్తి మీద మాచూపులు
గుత్తిలో మెలికలు తిరిగిన తళతళల చాకు మీద మా చూపులు
దాని దుప్పికొమ్ము పిడిమీద మా చూపులు
మామిడి పండ్లేకాదు శత్రువుల పొగరు కండలూ తరిగేది ఆ బాకు!

స్కూలు రిజిస్టరులో ఎవరికీ తెలియని 'సూర్యనారాయణ' పేరు
ఊళ్ళోవాళ్ళకి 'అబ్బిరాజుగారు'
మాకు మాత్రం అబ్బిగాడు మామయ్య
ముద్దులు దసరా బుల్లెయ్య!
జానపదంలో 'ఎన్.టీ.ఆర్'!
'మాయాబజార్'లో 'యస్వీఆర్'!
'కిస్మత్'లో అశోక్ కుమార్!
007 జేమ్స్‌బాండ్!
మా అబ్బిగాడు మామయ్య!!
స్కూలు ఫైనల్లో దండయాత్రలు చేసి చేసి

కడపటికి ఎలాగో గట్టెక్కి నలుదిక్కూలూ చూసి
విశాఖ కలెక్టరాఫీసులో చిన్న గుమాస్తాగా ప్రవేశించి
స్వయంకృషితో 'ఇంతింతై వటుడింతయై'
పి.డబ్ల్యూ.డి. లో సూపర్‌వైజరై
రెండు చేతులా సంపాదించి
అన్నలిద్దర్నీ వాళ్ళ అగాధ సంసారాల్నీ
అక్కల్నీ, చెల్లెల్నీ సమస్త బంధువుల్నీ ఆదుకొని,
నమ్మిన చిన్నన్న త్రవ్విన గోతిలో లోతుగా పాతుకుపోయి,
పిల్లల పెళ్ళిళ్ళు చెయ్యలేని నిస్సహాయత్వం బూజుకొంపలో కూలబడి,
ముసలితనంతో
రోగంతో రొష్టుతో
చుట్టూ దుమ్ము కంపుతో
అందరూ ఉండి ఎవ్వరూ లేని ఏకాకిగా
కుక్కి మంచం మీద
కుళ్ళుకంపు మధ్య
సర్కసు సింహంలా
దీనంగా
ధైర్యంగా
గంభీరంగా
పిచ్చిగడ్డంతో
విచ్చు కత్తిలాంటి బింకంతో
నరాలు కూడ గట్టుకున్న పొంకంతో
తెగిపోతున్న జ్ఞాపకాల దారాలు ముడివేసుకుంటూ
'సుబ్బు పెళ్ళి బ్రహ్మాండంగా చేశా' నని పొంగిపోతుంటే—
'స్వోర్డ్ ఆఫ్ టిప్పుసుల్తాన్' కి తుప్పు పట్టడం చూసి
భోరున ఏడుస్తున్న ఈమేనల్లుణ్ణి—
అష్టకష్టాలుపడి
అందమైన తన అన్నకూతుర్నిచ్చి వీడికి పెళ్లి చేసి
ఫలితంగా కృతజ్ఞతాబద్ధుడైన వీణ్ణి—
మెరుపుకళ్ళతో ఆనందంగా చూస్తూ
"బెంగుళూరు వచ్చానుగా... బృందావన్ ఎక్స్‌ప్రెస్‌లో" అని
అన్న మాటే పదిసార్లు అని
ఏడుస్తున్న వీణ్ణి మరీమరీ ఏడిపించి—
నేను ఆశించి వచ్చిన అనకాపల్లి బెల్లంవాసన పోగొట్టి

దుమ్ము వాసనగా
బూజు వాసనగా
ముసలివాని మూత్రం వాసనగా మిగిల్చిన
మా అబ్బిగాడు మామయ్యా!
నీ చుట్టూ కట్టుకున్న
నా ఊహల ఏడంతస్తుల గాజుమేడమీద
నీ వాస్తవికతా 'గల్ఫ్‌వార్' అమెరికన్ బాంబర్లు దాడి చేస్తే—
మా ఒళ్ళంతా రక్తం ఓడికలు కట్టి
నీ చుట్టూ ప్రవహిస్తున్న కుళ్ళు కాలవల మీది గాలి పీల్చుకుంటూ
రాత్రికి రాత్రి రాజమండ్రీ బస్సు ఎక్కి
ఒంటి కాలిమీద నిలిచి
అర్ధరాత్రి నిశ్శబ్దం మీద నడిచి
నేనూ
నువ్వు నాకు బ్రతుకు బహుమతిగా ఇచ్చిన ముద్దబంతి పువ్వూ
ఏడుస్తూ
ఏడుస్తూ
బెంగుళూరు దాకా శరీరాలు ఈడుస్తూ
ఆ ముసలితనం దరిద్రప్పుజైలులోంచి విడుదలై
మా మనసు పూలయింటికి రావలసిందిగా ఆహ్వానిస్తూ
రాలేవని తెలిసికూడా నీకోసం ఎదురు చూస్తూ
"ఎందు కొచ్చిన బెడద!
రాకుండా ఉంటే బాగుండును!"
అని లోపలి పొరల స్వార్థాన్ని ప్రార్థిస్తూ
నిన్ను మోసగించిన బంధు విరోధిసైన్యంలో చేరిపోతూ
వెంటనే జ్ఞానోదయుమై
నన్ను నేను బుద్ధికొరడాతో కొట్టుకుంటూ
సరిదిద్దుకుంటూ
నీకోసం ఎదురుచూస్తూ
స్వర్గంనుంచి పాతాళానికి జారిపడి
మధుర స్వప్నం నుంచి పీడకలలోకి ఊడిపడి
దుర్భరమైన గ్రీకుట్రాజడీని చూసినట్టు
కుమిలిపోయి
కుప్పకూలి పోయి

కుదేలయిపోయి
నేను నిలువునా కరిగి
కన్నీటి సెలయేటిగా మారి
దిక్కు తెలియకుండా పరుగెడుతూ
గులకరాళ్ళ మధ్య తలబాదుకుంటూ
ఘోర శాపగ్రస్తుడిలా ఏడుస్తూ
నిరంతరం
నీరాకకోసం
ఎదురుచూస్తూ—
మా బంగారు బాల్యమంతా
సంభ్రమాశ్చర్యాలతో
మెస్మరైజ్ చేసిన
అబ్బిగాడు మామయ్యా!
అమ్మ బుల్లి తమ్ముడా!
నీ కోసం
నీ కోసం
నీ—
కోసం—
ఈ చీకటిలో
నేనూ—
నువ్వు నాకిచ్చిన
'చిట్టి' దీపమూ—
కుండపోతగా
కన్నీరు కారుస్తూ......

31-12-1991

(1992 వ సంవత్సరం ఆగస్ట్ 8వ తేదినాడు నేను తణుకులో ఉండాగా భళ్ళమూడి సూర్యనారాయణ అనబడే మా 'అబ్బిగాడు మామయ్య' స్వర్గస్థుడయ్యాడనే వార్త స్పష్టాస్పష్టంగా తెలిసింది. వెంటనే నేనూ మా అన్నయ్య రాత్రికి రాత్రి బస్సులో అనకాపల్లి వెళ్ళాం, కనీసం పదవనాటికైనా అందుకుంటామనే ఆశతో. కాని మా మామయ్య జులై 27వ తేదీ ఉదయం 10 గం. 30 ని. లకు చనిపోయాడనీ, కర్మకాండ అంతా అయిపోయిందనీ చెప్పారు బంధువులు. నిరాశతో వెనక్కి తిరిగివచ్చాం. దారిలో మా అన్నయ్య, మా అమ్మగారు తరచుగా ఉపయోగించే ఒక సామెతను జ్ఞాపకం చేశాడు. "కోతి చచ్చిపోతే గోడ అవతల పారవేశారు!")

# జి. సుబ్బారావు

## జీవనశైలి

నేను చిన్నప్పట్నించీ చూస్తున్నాను.
వాడెప్పుడూ ఎవళ్లనో ఒకళ్లని గోకుతుంటాడు.

చిన్నప్పుడు బస్‌బండి వస్తే
తాతనో బామ్మనో గొకేవాడు
బడికెళ్ళేటప్పుడు చిరు తిళ్లకోసం
అన్ననో అమ్మనో గోకేవాడు.
పెట్టింది చాలకపోతే
వంటింట్లో కంచాల్ని గోకేవాడు.
ఇంతప్పట్నించీ
గోక్కోవటం వాడికలవాటే!

హైస్కూల్లో తన్నెవరైనా ఏమన్నా అంటే
తన జట్టు వాళ్లని గొకేవాడు
పరీక్ష హాల్లో ఎదుటి విద్యార్థిని
పేపరు కనిపించేలా రాసు కొమ్మని గోకేవాడు.

గోకుడు— వాడికి
గోరుముద్దలు తిన్నంత సులువు!

కాలేజీ క్లాసుల్లో
ముందు బెంచీ మీది
అందమైన అమ్మాయి పాదాల్ని
వెనకనుంచి పిల్లిలా గోకేవాడు.
ఆమె కాస్తా వీడి మాయలోపడి
పెళ్లామయ్యాక
టీవీకని, హోండాకని
వాళ్ల పుట్టింటివాళ్ళని గోక్కు రమ్మని
ఆవిణ్ణి పదే పదే గోకేవాడు.
నొప్పి తగలకుండా గోకడం .

వాడికి నేతిగారెలు తిన్నంత ఇష్టం!

యూనివర్సిటీలో క్లాసు కోసం
ప్రొఫెసర్ల పాదాల్ని
అరచేతులతో గోకేవాడు.
ప్రమోషన్ లిస్టులో తనపేరుకోసం
పలుకుబడి గలవాళ్లని గోకేవాడు.
రాజకీయ లబ్ధి కోసం
కులపెద్దల్ని గోకేవాడు.
ఎద్దుకి హాయినిస్తూ
పుండుని పొడుచుకు తినే కాకిలా
ఎంతో లాఘవంగా గోకగలడు.
పాదాల్ని పాదాలకు తాకించి గోకగలడు
కాలిగోళ్లతో అవతలివాడి పిక్కల్ని గోకగలడు
చేతి వ్రేళ్లతో సుతారంగా
వీపుల్ని గోకగలడు
మోచేతులతో పొడిచీ
మోకాళ్ళతో మర్దించి
సందర్భానుసారం
సమర్థంవంతంగా గోకగలడు
అవతలి వాళ్ళ సరదాలను బట్టి
ఇతగాడి అవసరాలను బట్టి
అలంరించేలా అదర గొట్టేలా గోకగలడు!

వాడుగోక్కు తింటున్నాడనో
గందరగోళం చేస్తున్నాడనో
మీరు నోరు విప్పబోతే
కిలాడి నవ్వొకటి నవ్వేసి
గిలిగింతలతో మిమ్మల్ని గోకేసి
మీ నోరు ముయ్యించెయ్యగలడు.

అవును!
నేను చిన్నప్పట్నించీ చూస్తున్నాను కదా
వాడెప్పుడూ ఎవళ్లనో ఒకళ్లని

ఏదో రకంగా గోకుతూనే వుంటాడు.

నా భయమల్లా
చాపకింద నీరులా ముంచేసే వాడి గురించికాదు
గుండెక్రింద తడి మిగిలివున్న మీవంటి వాళ్లగురించి!

(గోకలేని వాళ్లందరికీ ఇది అంకితం)

* * *

విప్లవ వీరుడు

ఒక అగ్గిపుల్ల
మరణిస్తే
కోటి పిడికిళ్లతో
కాగడాలు లేస్తాయి
— ఆసు రాజేంద్ర

* * *

ఎవరైనా

కాళ్ళు తడవకుండా
మహా సముద్రాలను దాటిన మేధావి కూడా
కళ్ళు తడవకుండా జీవితాన్ని దాటలేదు
— వసీరా

# జయరామ్
## చీకటి దృశ్యం

సగం చచ్చిన చంద్రుడు
సూర్యుణ్ణే ప్రార్థిస్తున్నాడు
తనకు సెలవివ్వమని
అర్థరాత్రి సూర్యుడు ఉదయించాడు
అన్యమనస్కంగా భూదేవి పెదవి విరిచింది
అపోహలు నిశాచరులై సంచరిస్తున్నాయి
రేపటి భవిత ఫుట్‌పాత్‌ల పై గురక పెడ్తోంది
దూరంగా శ్మశానం నుండి కాల్తోన్న మేధస్సు     కమురు వాసన
నిరుద్యోగం మత్తిఊడలై వీథుల్లో
నిర్వేదంగా పరచుకొంది
ఆలోచనల గుడ్లగూబలు అవతారికలై
రొద చేస్తున్నాయి
అర్థాయుస్సు రోడ్డు దీపం ద్యూటిలో తన
ప్రతాపాన్ని చూపుతోంది
దోమలు పోలీసులై దోషుల్నీ నిర్దోషుల్నీ బలిచేస్తున్నాయి
గేటుకాపలి కుక్క ఈ అర్థరాత్రి స్వాతంత్ర్యం వద్దంటోంది
ఆన్నార్తుల ఆక్రందన కీచురాళ్ళ రొదై వినిపిస్తోంది
కుండల్లో చన్నీళ్ళు సెంటిగ్రేడు చివరికి చేరుకొన్నాయి
ఆధునిక ప్రపంచం ఫ్యానురెక్కల పకపకల్లో
నిదరోయింది
వీటి మధ్యలో చీకటి కర్ఫ్యూ తొలగిస్తూ కోడి కేకేసింది
గడియారం ముల్లు కాలాన్ని జయించలేక ఓడిపోయింది!

* * *

నడిస్తే నా అడుగులు
మబ్బుల్లో పరుగెత్తే పిడుగులు
ఎత్తితే నా చేయి
మండే అగ్నిజ్వాల.
—శేషేంద్ర

## మాల్యశ్రీ

### చెదరిన కల

ఇంత వాన పడితే
అంతలోనే బురదై
కాళ్ళు జారిపోతుంటే
వొళ్ళు తేలిపోతుంటే
అడుగుతీసి అడుగు వేయలేని మట్టిరోడ్డు . . . . .
అంతలోనే కొంచెం ఎండకాస్తే
అప్పుడే ఎండిపోయి
పడికశ్లై — కత్తుల్లా గుచ్చుకొంటూ
నడవడానికి మళ్ళీ అసాధ్యమవుతుంది.
హేమంతంలో నైతే
ఎటుచూసినా పచ్చని తివాచీలు పరచినట్లు పైరుచేలు—
పైన కిలకిలా రావాలతో పల్లటీలుకొట్టే పరిగ పిట్టలు—
ఇక వసంతంలో నైతే
వెన్నెల వన్నెల్లో
జాను తెనుగు తీపితేట— జానపద క్రీడా పదాలతో
ఆబాలగోపాలం — ఆనంద సందోహంగా
మైమరచి మారు మ్రోగిపోయే
మనోజ్ఞవంతమైన మావూరు . . . .
ఇప్పుడు మారిపోయింది!
ఎంతో మీరిపోయింది!
మట్టిరోడ్డు మారిపోయి
మెటలు రోడ్డు వచ్చింది—
గడ్డియిళ్ళు ఎగిరి పోయి
డాబాలే వెలిశాయి —
కిరోసిన్ దీపాలకు బదులు
ఎలెక్ట్రిక్ లైట్లు—
ఎడ్లబండ్లకు పోటీగా
స్కూటర్లూ, మోపెడ్లూ...
ఊరికి అటు ఇటూ
అందంగా పొందికగా
జొన్నచేలూ— కందిపైర్లూ

అన్నీపోయి
మిరపచేలూ – పొగతోటలూ
నిత్యం ప్రత్యక్షం . . .
రాత్రిళ్ళు వాటి మీంచి సూటిగా దూసుకొచ్చే శీతవాతూలం
క్రిమి సంహారకౌషధ పరమదుర్గంధ వాహకం –
సహజ మృత్యుసంకేతంగా మోహరింపు . . .
ప్రకృతి సిద్ధ పరమ రమణీయ వాతావరణం
ప్రళయ విషమ విషకాలుష్యాల నిర్భర నిలయం
సంవత్సారాని కొక్కసారి
సీతారాముల కళ్యాణంరోజున
ఊరంతా ఉత్సాహంగా ఐక్యంగా సఖ్యంగా
ఆనందోత్సవాల్లో అరమరికలు లేకుండా
హాయిగా తేలిపోయే సామరస్యపూర్వక సముజ్జ్వల సన్నివేశం
ఇప్పుడు సన్నగిల్లి
ఎన్నికలు వచ్చినప్పుడల్లా
ముఠాలుగా చీలిపోయి
కర్రలూ కత్తూలూ పట్టుకొని
కక్షలూ కావేషాలు పెంచుకొని
కాళ్ళూచేతులూ నరుక్కొంటూ
అగ్నిగుండంగా మారే
అసాధారణ దారుణ దృశ్యం . . .
మాఊరు మారింది!
నా కమ్మని కల చెదరింది!!

* * *

నా మాటలు ఈ దేశపు మట్టిలో చల్లుతున్నాను
అన్నిదిక్కులా కత్తులు మొలవాలని
నేను జ్వాలల్ని కొరడాలుగా
ఝుళిపిస్తున్న అగ్నిని !
– శేషేంద్ర

# అడిగోపుల వెంకటరత్నం

## బహిరంగ లేఖ

నదుల్ని బిందువులుగా మార్చే ప్రయత్నం
నేలను అణువణువుగా చీల్చే ప్రక్రియ
అహింసకు పాతర హింసకు పట్టాభిషేకం
ఐక్యతను చంపి అనైక్యత పెంపకం
చావుకు సరిహద్దులు గీసి
బ్రతకమని భూగోళమంత స్వేచ్ఛ
మహానాటకం మొదటి అంకం ప్రారంభమైంది!
మనం వూహించిన ముగింపుతో

ఆఖరి అంకం ముగియనుంది!
రోజుకో రాజకీయ మహానాటకం
రోజుకో ఉత్తమ నటుడు
రోజుకో ఉత్తమ విలను

అంకం చివర్లో అన్నీ సయోధ్యలు!
వాగ్దానం జుంటి తేనె
నమ్మకం బాదాం హల్వా

కలలువద్దన్నా ఉచితంగా పంపకం!
మేధావులు ప్రణాళికా నిర్మాతలు
తిరోగమనపథ నిర్మాణానికి తాత ముత్తాతలు
ప్రజలెప్పుడూ తాజమహల్లకు రాళ్ళెత్తే కూలీలు
ప్రభువెవరో తెలియని పల్లకీ మోసే బోయీలు
ఎప్పుడూ మొయ్యడానికి నలుగుర్ని వెతుక్కునే నైజం
మట్టిగా మారడానికి చచ్చాక
ఎందరు మోస్తేనేం?
పంజరాలు వలస వెళ్తాయి
పక్షులు ఆకాశాన్ని జయిస్తాయి
నిరంతర దీక్షా జీవయాత్రకు

లక్ష్మణరేఖలు సరిహద్దులు నిలవవు!

ఇప్పుడు ఒక సమూహం అవసరం
ఇప్పుడు ఒక సమైక్యత అవసరం
ఇప్పుడు ఒక ప్రతిఘటనోద్యమం అవసరం
చేతిలో ఆయుధం వుంది
ప్రయోగ పథం తెలియక పడివుంది
ప్రస్థానం తెలిస్తే ముగింపు మరోవేదం
ముందా నాటకానికి తెరదించండి
కాకపోతే
మళ్ళీ మనం పోలింగు బూతుకు
వాడు కనకపు సింహాసనం వైపుకు!

* * *

ప్రతి ఏడూ భూమిని చీల్చుకుని బయటి కొచ్చే ధాన్యాలు
ఆకలి మీద దండయాత్రకోసం బయల్దేరే సైన్యాలు
— శేషేంద్ర

* * *

అర్ధరాత్రి నక్షత్రాలతో
ఆకాశం దిగివస్తుంది—
టేబిలు మీద లైటు
శిరోజాలు విరబోసుకొని
కూర్చొఉన్న దేవకన్యక అయ్
విలపిస్తుంది !
— శేషేంద్ర
* * *

# భద్రాచలం శశితేజ్

## పరుగు

గుండెకి ఎప్పుడూ
ఓ ముల్లు గుచ్చబడుతుండాలి
లేందే, ఈ ఎడారిలో వున్న
ఆ కాసింత తడీ ఆరిపోతుంది
చూసే దృశ్యాలు
కళ్ళని బరువెక్కించుతుండాలి
అప్పుడు రక్తం సంద్రమై
సాంద్రీకరించ బడుతుంది—
నేనెప్పుడూ నాలోకి
ప్రయాణించుతూనే ఉండాలి
ఒక అర్ధరాత్రి పూట
మిణుగురు పడే తపన
తెల్లారితే సూర్యుడి
ముందూ పోరాడాలి—

## ఒక్క వసంతం లా

శిశిరంలో
హేమ వర్ణ పత్రం లాంటి
దారిని నేను —
నా మీదినుంచి
నడిచి వెళ్ళు
ఒక్క వసంతంలా —

1993 లో జ్ఞానపీఠ బహుమతిని పొందిన ఒరియా కవి

# సీతాకాంత్ మహా పాత్రో

## ముష్టి కుర్రాడి మరణం

అతడు ఉదయం అక్కడ లేడు.
పబ్లిక్ పార్క్ మెత్తటి పచ్చిక మీద
చిన్ని పిట్ట కళేబరంలా అతడి శవం.
అతడు బ్రతికుండగా అటువంటి ప్రేమార్ద్ర స్పర్శ
ఎవరినుండీ పొందలేదు.

ఆరిపోయే దీపం బాధనూ అసహాయతనూ
అర్థంచేసుకుందుకూ,
సగర్వమైన అతని ఆఖరిమాటలు
ఒక్క సారైనా వినేందుకూ,
ఒక నక్షత్ర సమూహం రాత్రంతా వేచివుంది.
కాని అతడు నిశ్శబ్దంగా వున్నాడు.

కాంతి హీనాలవుతున్న అతనికళ్ళు
ఆకాశంలోని లక్షలాది దీపాలను చూస్తూన్నప్పుడు,
అతనికి చెప్పడానికేమీ లేదు
అతనికి మాట్లాడే శక్తిలేదు
అతనికి ఏ కోరికా లేదు
ఈ సువిశాల ప్రపంచంపైన ఏ ఫిర్యాదూ లేదు.

చంద్రుడు తన మృదువైన కాంతితో
ఎప్పుడో చనిపోయిన కన్నతల్లిలా
అతని వెన్ను తట్టాడు
చుక్కలు ఐదుపైసల బిళ్ళల్లా పదిపైసల బిళ్ళల్లా మెరుస్తూ
ప్రక్కనే వున్న ఖాళీపుత్తెలా దొర్లుతూ
అతని టిన్ను గిన్నెలో పడ్డాయి.

అతని చిన్నతనంలో లాగ
అతని తల్లి వీపుతట్టినప్పటిలాగ
అతడు జోలపాట విన్నాడు
మెత్తగా మెత్తగా ధ్వనించే గాలిలో—
(ఓ ఆకాశంలోని చంద్రుడా!
ఈ నల్లపిల్లవాడి దగ్గరకు రా).

అతడు అనంతంగా వింటున్నప్పుడు
నల్లటి నిద్ర అతణ్ణి ఆక్రమించింది.

తెల్లవారేసరికి అతడు అక్కడ లేడు
ఉదయం కూడా అక్కడ లేదు!

(జె.ఎం. మొహంతిగారి ఆంగ్లానువాదం ఆధారంగా
— తంగిరాల )

## ముష్టి కుఱ్ఱాడి శవ పరీక్ష

వద్దు, వద్దు, అతడి పొట్ట చీల్చవద్దు
జీర్ణంకాని ఆహారాన్ని వెదకడం కోసం
అతడి పొట్ట చీల్చవద్దు.
అది ఆకలి చావా ?
అనవసరమైన ప్రశ్నలకి
సమాధానాలు రాబట్టడంకోసం ప్రయత్నించవద్దు
అంత ఎక్కువ అపహాస్యానికి అవసరమేముంది ?
సత్యమెప్పుడూ బిర్రబిగిసి క్రూరంగా వుంటుందని
నీకు తెలియదా ?

అసెంబ్లీ వాస్తవ నివేదిక
అరవిచ్చిన మొగ్గలాంటి అతని ఆత్మను తాకలేదు,
ఉక్కు చక్రాల గంభీరోపన్యాసాలు
అతని మంచుబిందువుల బరువును గ్రహించలేదు.
పైగా, అతని పొట్టలోంచి మీరాశించేదేమిటి ?

ప్రతి మనిషిలోనూ ఏముంటుందో అదే మీకు దక్కుతుంది,
కత్తిమొన దగ్గర అది జిగేలు మంటుంది
మెత్తని చంద్రునిలా
కొన్ని ఆశలు, కొన్ని కలలు,
వేలాది సూర్యులవలె
అసంఖ్యాత వ్యధలు.

అతని పొట్టచీలిస్తే
అతని సిరల్లోంచీ ధమనుల్లోంచీ
ఏ కాంత పక్షుల గొంతులు
కీచుకీచుమంటూ బయటపడతాయి,
అవి వసంత గీతాలు పాడుతూ
ఎఱ్ఱంచుల సాయంసంధ్యాకాశం వైపు ఎగిరి పోతాయి.
చర్మంక్రింద పచ్చటి దిగంతాలలో

ఇంద్రజాల మేఘాల రంగురంగుల దొంతరలు
సగం వెలిసిపోయిన ఇంద్రధనుస్సు నీడ,
చల్లటి నీళ్ళలాంటి నెత్తుటిలో

సాంద్ర కీకారణ్యాల మర్మర ధ్వనుల శూన్యం.

ఉదయమే అకాలంగా అస్తమించిన ఒక సూర్యుని
గాయపడ్డ వ్యక్తిత్వమూ
లక్షలాది బాధలూ మాత్రమే.

(జె.ఎం. మొహంతి గారి ఆంగ్లానువాదం
– ఆధారంగా – తంగిరాల)

# ముక్కంటి మంటలు

## రక్తం సూర్యుడు (1973)

*   *   *

కాంతి లావాని
మోస్తున్న గుండె నాది
ఈ గుండె కటుపక్క సముద్రం
ఇటుపక్క ఎడారి.

*   *   *

కనురెప్ప లెత్తే ధైర్యం లేని వాళ్ళు
భవిష్యత్తు నాహ్వానించలేరు.

*   *   *

## చర్య (1975)

*   *   *

ఈ రోజు
రాత్రి చీకటి కళ్ళకు
కాలం గోరింటాకు పెట్టింది
రే పొద్దుటి కల్లా
సూర్యుడి గానే
పండి ఊరుకుంటాయి—ఎఱ్ఱగా

* * *

నన్నురి తీస్తే తీశారు–
వెలుగుతాటితో ఉరితీశారు
సంతోషం !
నన్నీ వధ్య శిలమీద
నరికితే నరికారు–
నా రక్తంతో
నాలుగు దీపాలు వెలుగాయి–
నిజంగా
నాది చావుకాదు – జన్మే–
చావులో జన్మించడం
నాకొక్కదానికే చాతనవును.

(–కొవ్వొత్తి గెరిల్లా)

* * *

నేత్ర ధనుస్సు (1978)

* * *

ధ్వంసం చేయ తగిందేదీ లేకపోతే నీకీలోకంలో
నువ్వు తప్పకుండా ధ్వంసం చేయుతగిన వ్యక్తివి.

* * *

ఎంత అందమైన మాంసం.........శరీరం
ఇంత అందమైన మాంసం
అద్దంలా ఉంకాలికాని, ఉదయం నీళ్ళగ్లాసులా ఉండాలికాని
మసి బొగ్గులా నిస్తేజంగా మాత్రం కాదు.

* * *

ఎవరి పాదాలు నిన్ను పరిపక్వమైన నేలలోకి తొక్కి
కొత్తగా మొలకెత్తే టట్టు చేస్తాయో
ఆపాదాలు నా గీతాలు.

* * *

ఎవడి వీర్యంతో ఈ భూమి
పునీతమవుతుందో
వాడిదే ఈ భూమి.

* * *

భారమితి (1983)

* * *

తల్లీ ! నీకు నమస్కారం
నన్ను కన్నందుకు
కని, నా ఈ జనంమధ్య పారేసినందుకు.

* * *

యుగ యుగాల తరబడీ ఆరని అడవిలా
శరీరం మండుతోంది
నా శరీర శిఖరాన్ని చేత్తో తాకు
జలభరిత మౌతావు
అణ్ణుభరిత మౌతావు
పోరాటాలు మొలుస్తున్న భూమి వౌతావు.

* * *

రాత్రితో వస్తారో
ఉదయంతో వస్తారో
దగ్గరగా రండి
అద్దానికి దగ్గరగా రండి
నా అద్దపు లోతుల్లో మీకళ్ళనీ ముఖాల్నీ
ముంచి
ఎరుపెక్కి
వేటకి బయల్దేరండి.

* * *

## మోహనా ! ఓ మోహనా ! (1988)

* * *

మనిషి వినా మట్టికి బ్రతుకేది?
మట్టికి ప్రాణశక్తి మనిషి
చేతనా చేతనాలకి వ్యక్తిత్వం, ఉనికి మనిషి.
మనిషి తాకితే మట్టి మేల్కొంటుంది.

* * *

నిఖార్సయిన మన రక్తంలోంచి మన మాట పుడుతుంది
మన చేతల్లోంచి, చిత్తశుద్ధిలోంచి శుచిగా మనమాట పుడుతుంది
మన దుఃఖంలోంచి, మనకోపంలోంచి మన మాట పుడుతుంది

మాట మన కులదేవత
మాట మన గ్రామదేవత
మాట మన వర్గ దేవత.

* * *

చొక్కా లేని వంటిని చూడు
వంటి మీద నెత్తురు క్రమ్ముతున్న దెబ్బల్ని చూడు
చిన్న చిన్న పిల్లల్ని చూడు, పిల్లల ముఖాల మీద
దుమ్ములో సమాధి అయిన రేపుని చూడు.

* * *

జనం ప్రభుత్వం మీదవేసే నిఘాయ్ కవిత్వం
జనం ప్రభుత్వాన్ని చీల్చి చెండాడే ఖడ్గమే కవిత్వం
జనం చేతిలో ఆపరేషన్ శస్త్రమే కవిత్వం.

* * *

ఇప్పుడే కాదు ఎప్పుడైనా పోరాటమే సత్యం, పోరాటమే శాశ్వతం
పోరాటం ప్రాణంగా బ్రతకని జాతికి స్వేచ్ఛలేదు, శాంతిలేదు.

* * *

మనుష్యుల్ని గుర్తు పట్టలేని స్థితిలో కవికి దేశం గుర్తుంటుంది
దేశం అంటే కవి, కవి అంటేనే దేశం.

* * *

వెళ్లి పోయిన వాళ్ళని గుర్తుపెట్టు కోవటం ఒక వేడుక కాదు
ఒకయాగం—ఒక సుదీర్ఘ యుద్ధాన్ని కొనసాగించటం.

* * *

(—శివారెడ్డి కావ్యాలనుండి సేకరణ : తంగిరాల)

# కవితా విలాసం

1. కె. శివారెడ్డి
ఝరీ పొయిట్రీ సర్కిల్
6-1-711, ఖైరతాబాదు
హైదరాబాదు 500 004.

2. 'మహర్షి'
ఎం.ఎస్. రావు
10-4-43, నెహ్రూవీధి
కొత్తగూడెం 507 110
ఖమ్మం జిల్లా.

3. కలుగోట్ల విజయాత్రేయ
గని 581 010
కర్నూలు జిల్లా.

4. దివాకర్ల రాజేశ్వరి
198, సెకెండ్ మెయిన్
మహాలక్ష్మీ లేఅవుట్
బెంగుళూరు 560 086.

5. మారుతీ శ్రీలత
309, I స్టేజి, II ఫేజ్
II క్రాస్, గోకుల
బెంగుళూరు 560 054.

6. 'యశశ్శ్రీ'
యెనిశెట్టి శ్రీరంగనాయకి
10-323/బి
మార్కాపురం 523 316
ప్రకాశం జిల్లా.

7. జి. సుబ్బారావు
ముఖ్య తపాలా కార్యాలయం
కొత్తపేట 533 223
తూర్పుగోదావరి జిల్లా.

8. 'జయరామ్'
ఆర్.బి. అంకం
రత్నా ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూట్
మార్కెట్ వీధి, రామచంద్రపురం 533 255
తూర్పుగోదావరి జిల్లా.

9. మాల్యశ్రీ చింతూరి
14-2-95 (ఎ) నాల్గవలైను
వేంకటేశ్వర కాలనీ, భద్రాచలం 507 112
ఖమ్మం జిల్లా.

10. అడిగోపుల వెంకట రత్నం
అసిస్టెంటు ఇంజనీరు
నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జున నగర్ 522 510
గుంటూరు జిల్లా.

11. భద్రాచలం శశితేజ్
కె.వి.వి.యస్. మూర్తి
వి.బి. థియేటర్ వెనుక
భద్రాచలం 507 112
ఖమ్మం జిల్లా.

# చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

గౌరవాధ్యక్షులు : శ్రీ టి. పట్టాభిరామిరెడ్డి (పఠాభి)

అధ్యక్షులు : శ్రీ డి.కె. ఆదికేశవులు

ఉపాధ్యక్షులు : శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఎ.ఎస్.
శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి
శ్రీ కె.పి. రావు
శ్రీ వై.వి. వెంకటేశ్వర రావు

కార్యదర్శులు : ఆచార్య తంగిరాల సుబ్బారావు
డా. ఆర్వీయస్. సుందరం

సహకార్యదర్శులు : డా. దివాకర్ల రాజేశ్వరి
డా పి.యు.బి. శర్మ
డా. కె. చంద్రప్ప
డా. ఎం. రుక్మాంగద నాయుడు
శ్రీ వి. రామనరసింహారెడ్డి

కోశాధికారి : ఆచార్య సరగు కృష్ణమూర్తి

* * *

**1994 లో చేరిన – పోషకులు :**

శ్రీమతి లక్ష్మీ సామ్రాజ్యం, శ్రీ యెనిశెట్టి సాంబశివరావు దంపతులు, మార్కాపురం, ప్రకాశం జిల్లా.

**జీవిత సభ్యులు :**

శ్రీ వి. వెంకటేశన్, తెలుగు పండితుడు, హోసూరు, తమిళనాడు.

**ప్రత్యేక సభ్యులు :**

1. ఆచార్య ఎన్. గోపి, తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
2. డా. పెన్నా శివరామకృష్ణ, పర్గి, రంగారెడ్డి జిల్లా.
3. ఆచార్య ఎం. రాజారావు, భౌతిక శాస్త్ర విభాగం, బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు.



చైతన్య కవితావేదిక అధ్యక్షులు
**శ్రీ డి.కె. ఆదికేశవులుగారు**
(బెంగుళూరు)



చైతన్య కవితావేదిక ఉపాధ్యక్షులు
**శ్రీ బుల్లా సుబ్బారావుగారు, ఐ.ఎ.ఎస్**
(బెంగుళూరు)

